PRSUM02A169

సాహిత్య
ప్రస్థానం
ఏప్రిల్ 2016
సంపుటి : 15 సంచిక : 4

# అసహనంపై మలి సమరం

హెచ్‌సియు నుంచి జెఎన్‌యు వరకూ ఒకటే ఉద్రిక్తత.. అక్కడ విద్యార్థి సంఘాల నాయకులపై దేశద్రోహులూ జాతి వ్యతిరేకులంటూ దాడి... జరిగిందేమిటో, ఆరోపణలకు ఆధారమేమిటో తెలిసేలోగానే హోరెత్తే ప్రచారం.. అరెస్టులు.. పోలీసులు,, నిర్బంధం.. ఇంతలోనే వారిపై ఆరోపణలకు ఆధారమే లేదని కల్పిత కథనాలని నిరూపణ. అయినా పొరబాటు దిద్దుకోకపోగా మరింత ఎదురు దాడి.. నిజంగా ఎన్నడూ వూహించిన పరిస్థితి ఇది. విద్యాలయాల్లో చదువుకునే ప్రతిభావంతులైన ప్రగతిశీల యువతపై ఇలాంటి ముద్ర వేయడం బాధాకరమే కాదు, సిగ్గుచేటు కూడా. కొద్దికాలం కిందట రచయితలు కవులపై ఇలాటి విషపూరితమైన దాడి జరిగి హత్యల వరకూ వెళ్లింది. దేశమంతా అసహనంపై ఆగ్రహం పెల్లుబికింది. ఆ సమయంలోనూ వారిపైనే ఎదురుదాడి సాగిందేగాని జ్ఞానోదయం కలిగిన దాఖలాలు లేవు. తమ చెప్పుచేతల్లో లేని విద్యార్థి సంఘాలపై ఇప్పుడు ఈ సరికొత్త దాడి చేయడం కూడా మతతత్వ మహావ్యూహంలో భాగంగానే చూడాలి. ప్రజాస్వామ్యంలో భిన్నాభిప్రాయాలకు క్రియాశీల కార్యకలాపాలకు అవకాశముండకపోతే ఆ మాటకే అర్థం వుండదు. విజ్ఞాన కేంద్రాలైన విశ్వ విద్యాలయాలపై ఈ విధంగా విరుచుకుపడటం విష ప్రచారం చేయడం సహించరాని విషయం. రోహిత్ వేముల ఆత్మహత్యతో అట్టుడికిన విద్యార్థి లోకం ఇప్పుడు కన్నయ్య కుమార్ శంఖారావంతో కదం తొక్కుతున్నది. ఇప్పటికైనా పాలకులు తమ తప్పులను సరిచేసుకోకపోతే ఇది అసహనంపై మలిసమరంగా మారడం తథ్యం.

కవర్ డిజైన్ : గిరిధర్

బొమ్మలు : తుంబలి శివాజీ, గంగాధర్, మీరా

## ఈ సంచికలో ...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్‌భవన్, ఫ్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి
కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002,
సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# అనుకున్నదే అయింది

- డా॥ సి నారాయణ రెడ్డి

అప్పుడప్పుడు
సంకల్పానికీ సమాచరణకూ మధ్య
రాపిడి జరుగుతుంటుంది.
ఇక బయలుదేరుదాం పద అని
ఆలోచన అంటే
అంత తొందరేముందిలే అని
ఆచరణ శీల మంటుంది
ఈ రాపిడిలో నలిగిపోతున్న
కాలానికి
విసుగు నసాళానికంటుకుంటుంది.
సముద్విగ్న చిత్తంతో
సంకల్పం అడుగుముందుకు మోపుతుంది.
దాని స్థితి అంతటితోనే
ఆగిపోతుంది.



ఇంతలో విసురుగా వీచిన వడగాల్పు
స్తబ్దంగా పడివున్న పరిసరాల
చురుకు పెంచుతుంది.
మోపిన అడుగులు
ఒక్క ఊపుతో
తమ గమన వేగంలో
విద్యుద్దీప్తిని పొదుగు కుంటాయి.
సంకల్పం
సమాచరణగా రూపుదిద్దుకుని
ఆశయ శిఖరాలను
తన అరిచేతిలోనికి తీసుకుంటుంది.
ఎంతటి కార్య సిద్ధికైనా
ఒక్కొక్కప్పుడు
కొన్ని అవాంతరాలు తప్పవు కదా.



# దీక్ష

- నూనెల శ్రీనివాసరావు
9492970231



ఊహించని వేవో నా చుట్టూ
నిజాలై తిరుగుతున్నాయ్
జరగకూడని వేవో నా ముందర
వాస్తవాలై ఎదురొస్తున్నాయ్
నేను మనిషి....
విచక్షణ, వివేకం కలవాణ్ణి
ఐతేనేం!
ఏవో కట్టుబాట్లు
మరేవో అడ్డుగీతలు
అనాధిగా నన్ను ఇతరుల నుండి
ఇతరులను నా నుండి విడదీసి
వికసించే నా నవనాగరిక నేత్రాలకు
అనాగరిక నల్లపట్టాకట్టి
వెనుకటి చీకటి గుహల్లోకి
ఈడ్చుకుపోతున్నయ్
అప్పుడప్పుడు నాలో మనిషి మేల్కొన్నా
ఒక్క కన్నీటి బొట్టుతో ఆవిరైపోయె
దశాబ్దాల, శతాబ్దాల నమ్మకాలు
ఊరకనేపోవు...
వదిలించుకుందామన్నా.....
వెనుకకు తరిమే
ఈదురు గాలులు, విషవలయాలు
పోనీ ....ఊరకుందామంటె
నా దారంతా తెగిపడుతున్న
నిస్సహాయ నెత్తుటి ముద్దలు
రోజు రోజుకి వల్లకాడైపోతున్న
ఊరిచివర విసిరేసిన ఊళ్ళు
ఎగిసేమంటల ఆర్తనాధాలు
కూలే గుండెల మృత్యుగీతాలు
నాలో మనిషిని
ప్రశ్నలై భయపెడుతున్నయ్
నాలో మనిషిని
శూలాలై గాయపరుస్తున్నయ్
ఇక లేవాలి, లేవాలి
లేవాలి....నాలో మనిషి
నాలో మనిషి....లోలో మనిషి...
మరిగే నెత్తురు మరగించాలి
పారే నెత్తురు పారించాలి
కలం, గళం, పదునెక్కించాలి
కోట్ల భావాలు ఒక్కటై విప్లవించాలి
మనిషి మనిషిగా మసిలేదాక
మనిషి మనిషిలో మసి తొలగేదాక
ఎల్లలు లేని మానవత ఎగిసేదాక
కల్లలు లేని మానవత విరిసేదాక



## కథ



# నాన్నకు ప్రాణంతో

- చందక గాయత్రీ రావు
9492454655

ఉన్నచోటే ఉండిపోతే..........మనం ఎక్కడున్నామో తెలీదు

ఎలా ఉన్నామో తెలీదు..........ఎందుకున్నామో కూడా తెలీదు

పై అక్షరాల దగ్గర నా కళ్ళు ఒక్కసారిగా ఆగిపోయాయి. ఆ అక్షరాలల్లో నా కళ్ళు ఏవేవో జ్ఞాపకాల్ని ఏరుకొంటున్నాయి. ప్రస్తుతం నేను చదువుతున్న పుస్తకంలో వాక్యాలివి. పుస్తకం పేరు. సరిగ్గా చూడలేదు. అసలు చదవాలని కూడా లేదు. రాత్రి పడుకొనే ముందు పుస్తకం చదివి పడుకోవడం నాకలవాటు. అలవాటుగానే తీసాను. అందుకే పుస్తకం పేరు కూడా చూడలేదు.

పుస్తకాలు మనుషలను మార్చగలవా!! ?

నవ్వొచ్చింది. అదే నిజమైతే నా అల్మరాలో ఇన్ని పుస్తకాలెందుకు. ఒక పుస్తకం సరిపోతుంది కదా! ఆ ఒక్కటీ భగవద్గీత కావచ్చు, ఖురాన్, బైబిల్.....ఏదైనా కావచ్చు.

అంత పెద్ద పుస్తకాలెందుకు. పెద్దవంటే ఐమీన్ సైజ్‌లో కాదు. ఓ ఏభై పేజీల చలం పుస్తకమో, మరొకటో, మరొకటి చాలదూ!? మనం మారాలనుకుంటే

పుస్తకాలు మనుషలను మార్చగలవా!! ?

నాకింకా నవ్వు ఆగలేదు. ఏమో తెలీదు. కానీ ఉత్తరాలు మార్చగలవు. మనుషులందరినీ అని నేననను. ఎందుకంటే అందరి సంగతీ నాకు తెలీదు.

ఎవరి సంగతో ఎందుకు. కనీసం నా గురించైనా నాకు తెలుసా?

ఎక్కడి నుంచో నవ్వు.

చుట్టూ చూసాను. వినిపిస్తూనే ఉంది. టేబుల్ మీద, వెయిటర్ కింద. ఫేన్ గాలికి ఎగిరెగిరి నవ్వుతోంది.

నాకూ నవ్వొచ్చింది. అవును కనీసం నాగురించైనా నాకు తెలుసా. నవ్వుతూనే ఉత్తరాన్ని తడిమాను. ఆర్తితో....అచ్చం నా కూతుర్ని ముద్దు పెట్టుకున్నట్టే ఉంది. రెండు చేతులతో

గుండెలకు హత్తుకున్నాను. నా చిట్టి తల్లిని ఎత్తుకున్నట్టే ఉంది.



ఈ ఉత్తరాన్ని నేను చదవనక్కర లేదు. గత కొన్ని సంవత్సరాలుగా ప్రతిరోజూ చదువుతూనే ఉన్నాను. అందులోని ప్రతి పేరా, ప్రతీ అక్షరం, ప్రతీ కామా......అన్నీ, అన్నీ నాకు కంఠతావచ్చు.

గుర్తు పెట్టుకోవడానికి అందులో ఉండేవి అక్షరాలా?! నాచిట్టితల్లి బాధలు.... వేదనలు...... అనుభవాలు....... నిట్టూర్పులు....కోపాలు, అగ్నికీలలు అన్నీ, అన్నీ నాకు గుర్తే.

అయినా మర్చిపోతే కదా గుర్తుపెట్టుకోవడానికి!

జీవితాన్నెవరైనా మర్చిపోతారా?!!

జీవితాన్నెవరైనా మర్చిపోతారా...? ఎందుకు మర్చిపోరు. నేను లేనూ. నన్ను నేనే మర్చిపోతే....జీవితం, పెళ్ళాం, పిల్లలూ....ఇవన్నీ ఒక లెక్కా

"మనల్ని ఎందుకింత బాధ పెడుతున్నారు?"

కొన్ని సంవత్సరాల కిందట నాకెదురైన ప్రశ్న. అడిగింది నా చిటితల్లి శిశిర కాదు. అది నోరెత్తి ఒక్క మాట కూడా అనదు. నన్నే కాదు. తన తమ్ముడు, చెల్లిని కూడా అనదు. ఈ ప్రశ్న వేసింది వాళ్ళమ్మ. నా భార్య.

"మీ తాగుడు వలన మీ జీవితమే కాదు, మన అందరి జీవితాలు నాశనమై పోతున్నాయి. ఇంట్లో ఈడొచ్చిన కూతురు ఉన్నా....నెత్తిమీద బండెడు అప్పులున్నా పట్టించుకోకుండా మీ ఒళ్ళు కూడా గుళ్ళు చేసుకుంటున్నారు. ఎన్నాళ్ళని భరించమంటారు."

అప్పుడు నా భార్య అడిగిన ప్రశ్న తలుచుకుంటే ఇప్పుడు కంట్లో తడిఊరుతుంది గానీ అప్పుడు నాకు ఇదో పెద్ద జోక్. ఎందుకంటే నా రీజన్స్ నాకున్నాయ్.

అవి ఎంత పెద్దవంటే..... ఈ చేతకాని ప్రభుత్వం నన్ను చిన్న చూపు చూసింది. నా అర్హతను గుర్తించలేకపోయింది. మరి నాకు బాధనిపించదా. అందులోనూ అంత పెద్ద చదువుకు ఒక చిన్న ప్రైవేటు కంపెనీలో చాలీ చాలని జీతంతో కొలువు. ఎవరు మాత్రం బాధ పడరు. మరి ఆ బాధ ఎవరు తీరుస్తారు.

మొదట్లో బాధకోసం రెండు పెగ్గులు. తరువాత బాధపడుతూ మరో రెండు. ఆ తరువాత మందు మానలేక పోతున్నానే అని బాధలో మందు తరువాత, తరువాత జీతమంతా, జీవితమంతా మందు....మత్తు....చిత్తు....

ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నాను.

గతం గుర్తొచ్చిన ప్రతిసారీ ఒంట్లో సన్నగా వణుకు పుడుతూ ఉంటుంది. దానిని కంట్రోల్ చేసుకోవడానికి చాలా కష్టపడవలసి వస్తుంది. నెమ్మదిగా వణుకు తగ్గింది. వర్తమానంలోకి వచ్చాను. మళ్ళీ నవ్వు...!!! ఈ సారి నవ్వింది ఉత్తరం కాదు. నా చిట్టితల్లి. ఫోటోలో.

ఫ్రేమ్‌కట్టిన గోడమీద ఉన్న ఫోటో లో కాదు. ఉత్తరం ప్రక్కన ఉన్న న్యూస్ పేపర్ లో పడిన ఫోటోలో ఫోటో పైన పెద్ద పెద్ద అక్షరాలతో నా బలహీనతను గుర్తు చేస్తూ హెడ్డింగ్.

"చదువుల తల్లి ఆత్మహత్య"

'లెక్కలు పరీక్ష లో తప్పిందని పట్టణానికి చెందిన శిశిర అనే యువకురాలు బలవన్మరణానికి పాల్పడింది. గత సంవత్సరం జరిగిన పదవ తరగతి పరీక్షల్లో టౌన్ టాపర్ అయిన శిశిర అనూహ్యంగా ఈ సంవత్సరం ఫెయిల్ అవ్వడం దురదృష్టకరం. పైగా లెక్కలంటే తనకెంతో ఇష్టమైన సబ్జెక్ట్ అనీ, ఎప్పుడూ లెక్కల్లో శతశాతం మార్కులు సాధించేదనీ, కానీ తను లెక్కల పరీక్ష తప్పడం తమకెంతో ఆశ్చర్యాన్ని కలుగజేస్తుందనీ ఆమె స్నేహితులు తీవ్ర దిగ్భ్రాంతి, ఆవేదన వ్యక్తం చేసారు. పరీక్ష ఫెయిల్ అవ్వడం వలననే తను ఆత్మహత్య చేసుకుందనీ, దీనికి ఎవరూ బాధ్యులు కారని స్వంత దస్తూరీతో, రాసిన సూసైడ్ నోట్‌ను పోలీసులు స్వాధీనం చేసుకున్నారు....'

నన్ను నేను మర్చిపోయి మత్తులో జోగుతున్న రోజుల్లో ఓ రోజు ఉదయాన్నే పేపర్‌లో వార్త అది.

శిశిర ఆత్మహత్య నన్ను తీవ్రంగా కలచి వేసింది. నా భార్య పరిస్థితి సరేసరి, వారం రోజులు తను గదినుండి బయటకు అడుగు పెట్టలేదు.

కన్నకూతురు చనిపోతే బాధపడని తండ్రి ఈ లోకంలో ఎవరూ ఉండరు కదా. అదీ ఆత్మహత్యే చేసుకుంటే ఆ బాధ మాటల్లో చెప్పలేం.

మొదట్లో నేనూ బాధ పడ్డాను. తరువాత తరువాత తాగడానికి నాకు మరొక కారణం దొరికింది. పైగా కోపం. శిశిరపై నా చిట్టితల్లి పై.

ప్రతిరోజూ మూడో రౌండ్‌లో ఉండగా అనుకునే వాన్ని "నా పరువు తీసింది. తను నా కూతురైనందుకు నా తల దించుకొనేలా చేసింది. పరీక్ష పోతే ఎవరైనా చనిపోతారా. అదీ నా శిశిర ఇప్పుడు కాకపోతే తరువాత.

ఛా.....నా పరువు తీసింది."

ఓ పది మత్తు రోజులు గడిచాక. ప్రతిరోజు లాగే ఆ రోజు కూడా. బాటిల్ ఓపెన్ చేసి, రెండు రౌండ్లు తాగాను.

శిశిర మరణం తరువాత ఒంటరిగానే తాగుతున్నాను. అదీ నా గదిలోనే.



ఎదురుగా కవ్‌బోర్డ్ లో చిన్నగా కనిపించింది. దాన్ని గుర్తు పట్టడానికి నాకు ఎక్కువ సమయం పట్టలేదు. అది నా జీవితంలో భాగం కాబట్టి ఇంకా చెప్పాంటే అంతకంటే ఎక్కువ. మందు బాటిల్. కానీ కప్ బోర్డులో అదే పుస్తకాల మధ్యలో ఎలా వచ్చిందో అర్థం కాలేదు. ఆ బ్రాండ్ నేనెపుడూ తాగను. నేనేకాదు సాధారణంగా మందు తాగేవాళ్ళెవరూ ఆ బ్రాండ్ ప్రిఫర్ చేయరు.

లేచి నెమ్మదిగా తూలుతూనే దగ్గరగా వెళ్ళి దాన్ని నా చేతిలోకి తీసుకున్నాను.

దాని కింద తెల్లగా ఏదో కనిపించింది. చేతిలో తీసుకుంటే ఉత్తరం అని తెలుస్తూనే ఉంది.

నెమ్మదిగా మడతలు విప్పాను.

శిశిర చేతిరాత నాకు బాగా తెలుసు. కానీ అక్షరాలు వంకర టింకరగా....ఏదో గాబరాతో రాసినట్టున్నాయి.

రాత్రి నిద్ర పట్టే సరికి సమయం ఎంతైందో తెలీదు. అసలు పడుకున్నానో లేదో కూడా చెప్పలేను.

ఉదయాన్నే లేచాను. గుండెలమీద ఉన్న ఉత్తరాన్ని మడిచి జాగ్రత్తగా దాచాను. ఇంటినుండి బయటకు నడిచాను. నన్ను ఆపాలని నా భార్య ప్రయత్నించలేదు. ఎప్పుడూ అలా చెయ్యదు కూడా. ఎటుతిరిగానో, ఎక్కడ తిరిగానో గుర్తులేదు. అర్ధరాత్రి దాటాక ఇంటికి చేరాను. తినకుండానే పడుకున్నాను.

ఒక్కరోజు కాదు, రెండు రోజులు కాదు. సుమారు నెల రోజుల పాటు నా దినచర్య ఇదే. శిశిర పోయిన బాధలో నా భార్య. ఈ నెల రోజుల్లో ఒక్కరోజు కూడా నేనూ, నా భార్య ఒక్కటంటే ఒక్కమాటకూడా మాట్లాడుకోలేదు. కానీ రాత్రి నేను కొట్టిన తలుపు తీసిన తరువాత ఆశ్చర్యపోయేది. ఎందుకు పోదూ. ఈ నెలరోజుల్లో నేను ఒక్కసారంటే ఒక్కసారికూడా తాగలేదు.

సుమారు నెలరోజుల సుదీర్ఘ ఉదయాల తరువాత ఓ ఉదయాన్ని నా భార్యతో నేను మాట్లాడిన మొట్టమొదటి మాట

"ఆఫీస్ కు వెళ్ళొస్తాను.

నన్ను చూసి ఆశ్చర్యంతో "సరే" అంది.

అప్పటి నుంచి ఏనాడూ అనవసరంగా ఆఫీస్‌కు సెలవు పెట్టలేదు. ఆఫీస్ , ఇల్లు, భార్య, పిల్లలు....ఇదే నా జీవితంగా మార్చుకున్నాను. నా మార్పును నా భార్య గమనించే ఉంటుంది.

కానీ శిశిర మరణం తరువాత దేన్నీ పెద్దగా పట్టించుకోవడం మానేసింది. అదో రకమైన నిర్లిప్తతలోకి వెళ్ళిపోయింది.

కానీ నాకెందుకో ఈ జీవితం సంతృప్తి అనిపించడం లేదు. అస్సలు లేదు.

నా శిశిరకోసం ఏదైనా చెయ్యాలి.

ఏం చేస్తే బాగుంటుందో అర్థం కాలేదు. బాగా ఆలోచించాను. నా చదువు, తెలివితేటలూ అన్నీ కలిపి ఆలోచించాను. నా చిట్టితల్లి శిశిరకు పెద్ద బహుమతి ఇవ్వాలి. పుస్తకాలు, పత్రికలు అన్ని చదివిన తరువాత ఓ నిర్ణయానికి వచ్చాను.

ఆ నిర్ణయం పేరే 'జీరో ఫౌండేషన్"

దూబగుంట రోశమ్మ స్ఫూర్తితో మద్యపానానికి వ్యతిరేకంగా దేశ వ్యాప్తంగా పెద్ద ఎత్తున ఆందోళన చేస్తోన్న స్వచ్ఛంద సంస్థ. దాని గురించి వివరాలు సేకరించాను.

మరికొందరు ఔత్సాహికులతో నేనుండే ప్రాంతంలో ఒక విభాగాన్ని ప్రారంభించాను. మొదట్లో చాలా కష్టపడే వాళ్ళం. తరువాత తరువాత కౌన్సిలింగ్. ఉద్యమాల ద్వారా ప్రజల్లో చైతన్య కార్యక్రమాలు చేపట్టాం.

మరీ ముఖ్యంగా జిల్లా నడిబొడ్డుకు 3కి.మీ దూరంలో ఉన్న ఆల్కహాల్ ఫ్యాక్టరీ మీద తీవ్ర అసహనంతో ఉన్న స్థానికులు, ముఖ్యంగా మహిళలు సంపూర్ణ మద్దతు ప్రకటించారు. చివరి ప్రయత్నంగా నేను 8రోజుల నిరాహార దీక్ష కూడా చేసాను.

ప్రజా ఉద్యమానికి ప్రభుత్వం తలొగ్గింది. ఫ్యాక్టరీ మూయించివేయడానికి అంగీకరించింది.

ఈ నిర్ణయంతో మా కార్యకర్తలు సంబరాలు చేసుకుంటుండగా ఆరోజు రాత్రి ఓ విచిత్రం మా ఇంట్లో జరిగింది.

అపుడు నా నోట మాట రాలేదు. శిశిర గుర్తొచ్చింది. ఆశ్చర్యం, ఆనందం, దిగ్భ్రాంతి, ఆవేదన.....ఏవేవో మనసుతో మారుతూనే ఉన్నాయి.

గడియారం మూడు గంటలు కొట్టింది. ఈ లోకంలోకి వచ్చాను. చదివిన పుస్తకాన్ని ప్రక్కన పెట్టాను. పడుకుంటూ నా చిట్టితల్లి రాసిన ఉత్తరాన్ని మడతలు విప్పాను. ప్రతిరోజూ పడుకొనే ముందు పుస్తకాన్ని మూసి, ఉత్తరాన్ని తెరుస్తాను. ఇది నా అలవాటు....కాదు ఇష్టం. ఎందుకంటే తరువాత రోజుకు కావలసిన నైతిక స్థైర్యం నా మనసులో నింపుతుంది.

ఉత్తరంలో అక్షరాల వెంట నా చూపులు పరుగెడుతున్నాయి. ''ప్రియమైన నాన్నకు.....



నేను మీకు రాసే మొట్టమొదటి ఉత్తరం....కానీ విషాదమేమిటంటే, మొదటిదే చివరిది కావడం.

ఈ ఉత్తరాన్ని చదువుకున్నంత సేపూ మీకు నన్ను చంపాలన్నంత కోపం వస్తుందని తెలుసు. కానీ ఆ అవకాశం లేదుకదూ. కోపం వరకు ఓకే. కానీ చంపేంత...???! నవ్వొస్తుంది.

ఇన్ని సార్లు చనిపోవడానికి నేనేమైనా మందుమత్తులో ఉన్న నీ మనసునా. అఫ్టాల్ మనిషిని. చేతగాని నీ చిట్టితల్లిని.

చావైనా, పుట్టుకైనా చివరికి మనసు విరిగి ముక్కలవ్వడమైనా ఒక్కసారే కదా.

మత్తుదీ, నీదీ ఒకే భాషా యాస కదా. మందు భాషలో చెబితేనైనా నీ మనసుకు చేరుతుందేమోనన్న పిచ్చి భ్రమలో కాస్త ఘాటుగా, నీ మందులా వాగాను, క్షమించండి.

ఇంతకీ నామీదెందుకు నాన్నా అంత కోపం. నా ప్రాణం గురించేగా. సరే ఒక ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పు.

ప్రాణం విలువెంత??!

ప్రశ్న అర్థం కాలేదా. సరే మరోలా ప్రశ్న వేస్తాను.

ఒక మనిషి ఆత్మహత్య చేసుకోవడానికి ఎంత కారణమైతే బాగుంటుంది?

ఇప్పుడు సరిగ్గా అర్థమయ్యిందనుకుంటా.

నేను చనిపోవాలని నిర్ణయించుకొనే ముందు చాలా జీవితాలు పేపర్లో చదివాను నాన్నా.

నాన్న తిట్టాడని ఒక తమ్ముడు నూతిలో దూకాడట ఈ మధ్యనే, టి.వి.లో. తన నాయకుడు ఓడిపోయాడని ఇంకొకడు, అంతెందుకు తన పెంపుడు పిల్లి చనిపోయిందని దాని పక్కనే ఆత్మహత్య చేసుకుందట ఒక విదేశీ పిల్లి ప్రేమికురాలు.

వాళ్ళందరి దృష్టిలో ఇన్ని పెద్ద పెద్ద కారణాలు నాకు చాలా సిల్లీగా అనిపించాయి.

'నా కారణం కూడా మీకు సిల్లీగానే అనిపించే ఉంటుంది. "మార్చికాకపోతే సెప్టెంబర్, ఈ సంవత్సరం కాకపోతే వచ్చే సంత్సరం, మేత్స్ కాకపోతే కంప్యూటర్స్. ఇన్ని ఆప్షన్స్ ఉండగా పరీక్ష పోయిందని ఎవరైనా ప్రాణం తీసుకుంటారా." ఇదే కదూ మీ ప్రశ్న. ఆవేదన, నామీద కోపం.

నవ్వొస్తోంది నాన్నా. నిజంగా విషాదంగా నవ్వొస్తోంది. ఈ ప్రశ్న నిజంగా మీదైతే ఆవేదనతో నవ్వొస్తోంది.

నేను నీ శిశిరను నాన్నా. పరీక్ష పోతే ప్రాణం తీసుకుంటానని నువ్వెలా అనుకున్నావ్.

చదువే ప్రాణంగా ప్రేమించే అమ్మాయి, ఇంత వరకు ఏ క్లాస్‌లో కూడా మొదటి ర్యాంక్ తప్ప కనీసం రెండవ ర్యాంక్ కూడా రాని ఒక అమ్మాయి, 10వ తరగతిలో మన పట్టణంలోనే మొదటి స్థానంలో నిలిచిన మీ శిశిర అఫ్టాల్ పరీక్షల్లో అదీ తన కిష్టమైన లెక్కల్లో ఫెయిలవుతుందని ఎలా అనుకున్నావ్ నాన్నా.

ఇప్పటికైనా మీ మత్తు కొంచెం దిగిందా. తన చిట్టి శిశిర ఊపిరి ఇంత అర్థాంతరంగా ఆగిపోతోందో ఆలోచించారా.

ఆలోచించలేవులే. నీవు ఆలోచిద్దామన్నా నీ నరనరాల్లో రక్తంలో ఇంకిన మందుమత్తు నీకాఛాన్స్ ఇవ్వదు. అసలు ఇంకిపోవడానికి నరాల్లో రక్తం ఉంటేకదా. అదెప్పుడో చిక్కబడి, మందుకు విందైపోయి ఉంటుంది.

ఎన్ని నెలలు సంవత్సరాలు...ఎదురు చూసానో అమ్మ కళ్ళల్లో ఆనందంకోసం, ఆనందం అటుంచితే. తడి కళ్ళల్లోతడి. అమ్మ కళ్ళల్లో తడి. తడిలేని అమ్మ కళ్ళు చూసి ఎన్ని సంవత్సరాలైయిందో.

ఆ కళ్ళను చూసి కూడా మారాలనిపించలేదా నాన్నా. "ఈ పాడు తాగుడు ఎక్కడ అలవాటయింది నీకు" అని అమ్మ ఎన్నిసార్లడిగినా. "నీకేం తెలుసు నా బాధ. పోస్ట్‌గ్రాడ్యేషన్‌కు కూడా ఉద్యోగం ఇవ్వలేని అద్వాన్న స్థితిలో ఉన్నాయి మన ప్రభుత్వాలు. ఇంత పెద్ద చదువు చదివి, ఇంత చిన్న ప్రైవేటు ఉద్యోగం చేయలేక, చాలీ చాలని జీతంతో నిన్నూ, పిల్లల్నీ పెంచలేక ఎంత ఆవేదనలో తాగుతున్నానో." అంటూ సంబంధం లేని సమాధానాలు.

నీ చాలని జీతం లోంచి కొంత తీసి మందు కొడితే మా కడుపులేవో నిండుతున్నట్లు, మా చదువులేవో వెలిగి పోతున్నట్టు. అర్థం లేని వాదాలు. తర్కం లేని వేదాలు.

ఆ రోజు సంక్రాంతి. నాకు బాగా గుర్తు. అందరూ పండగ సంబరాల్లో ఉంటే మొట్టమొదట సారిగా మీ కడుపులో చిన్నగా నొప్పి అన్నారు. అమ్మ ముఖంలో అంత ఆందోళన నేనెప్పుడూ చూడలేదు. మీ నొప్పి ఎక్కువౌతున్న కొద్దీ అమ్మ ఆందోళనలో భయం.

సరిగ్గా గంట తరువాత తెలివి లేకుండా హాస్పటల్ బెడ్ మీద మీరు. అమ్మ డాక్టర్ తో ఆందోళనగా మాట్లాడుతోంది. నాకు సరిగ్గా తెలియడం లేదు కానీ, ఏదో జరుగుతోందని కనిపిస్తోంది.

ఇక మందు ఎక్కువైతే మనిషి బ్రతకడం కూడా కష్టమన్నారని అమ్మ ఎవరితోనో చెబుతోంది. దీని గురించి నేను పెద్దగా ఆలోచించలేదు. ఆ పరిస్థితుల్లో కూడా నిన్నలా హాస్పటల్లో వదిలి అరగంట బయటకు వెళ్ళి వచ్చింది. ఎందుకో అర్థం కాలేదు.



మూడు రోజుల తర్వాత హాస్పటల్ నర్స్ ద్వారా నేను తెలుసుకున్నాను. ఆ టైమ్‌లో అమ్మ వేరే హాస్పటల్‌కి వెళ్ళిందని. ఎవరికో అర్జంట్ అయితే తన రక్తం ఇచ్చిందని. బదులుగా వచ్చిన డబ్బుల్ని హాస్పటల్‌లో కట్టి మందులు తెచ్చిందని.

ఆ విషయం తెలిసిన క్షణంలో నేను తిన్న షాక్ ఎప్పటికీ మర్చిపోలేను. కానీ దానికన్నా పెద్దది సుమారు లక్షరెట్లు పెద్దది తరువాత రోజు తగిలింది. అది మీ ద్వారా.

హాస్పటల్ నుండి డిశ్చార్జ్ అయిన సరిగ్గా ఐదోరోజు, అమ్మ తన రక్తాన్ని మందు బిళ్ళలుగా పోతపోసి మీకు అందించిన నుండి సరిగ్గా ఐదో రోజు. మీకు బాగా అలవాటైన రూంలో, మీకు అలవాటైన ఫ్రెండ్స్ మధ్య మందు కొడుతూ మిమ్మల్ని చూసాను. చాలా ఆశ్చర్యం వేసింది. మనుషులు, ఇలా కూడా ఉంటారా, భర్తలు తండ్రులు ఇలా కూడా ఉంటారా అనిపించింది. కానీ అంతకన్నా పెద్దషాక్ ఆ టైమ్‌లో మీరు మీ ఫ్రెండ్స్‌తో అన్న మాటలు.

ఇప్పటికీ.... ఇప్పటికీ నా రెండు చెవుల్లో మోగుతూనే ఉన్నాయి.

"నాభార్య దేవతరా. దేవత . ఎంత మహాలక్ష్మీ కాకపోతే తన రక్తాన్నిచ్చి నన్ను బతికించుకుందిరా......నా భార్య దేవతరా...." తరువాత మరి వినదలుచుకోలేదు. అంటే.....అంటే.....మానాన్నకు, మీకు తెలుసన్నమాట. అమ్మ రక్తం ఇచ్చిన విషయం. దాంతో హాస్పటల్ బిల్లు కట్టి, మందులు కొన్న విషయం. అంతా తెలిసీ.....అయినా మళ్ళీ తన ఫ్రెండ్స్‌తో ఈ తాగుడు...

ఛా!! మరి ఆలోచించాలనిపించలేదు.

అప్పుడే మొట్టమొదటి సారిగా అనుకున్నాను.

మా నాన్న మరి మారడు....మా జీవితాలింతే....

కానీ ఎలా....ఎలా వదులుకోవడం. కన్నబంధం, పెంచినబంధం, జీవితాన్ని పంచినబంధం, ఎలాగైనా మానాన్నను మార్చాలి. మార్చగలనా. తాగకుండా ఉండేలా మార్చగలవా. మా జీవితాలు బాగుపడతాయా ఎలా ?! ఎలా?!

ఎలాగో సరిగ్గా నెలరోజుల తరువాత సమాధానం దొరికింది. ఒక భయంకర పరిస్థితుల రూపంలో...

ఆ పరిస్థితికి సూత్రధారి, మీ ఆఫీస్ లో మీ కొలీగ్, అంతకంటే అతడు మీ గాజుగ్లాసులో సగం.

అతని పేరు నాకు తెలీదు. ఆ రోజు నేను కాలేజీ నుండి ఇంటికొచ్చే టైమ్‌లో అమ్మతో మాట్లాడుతూ కనిపించాడు. నన్ను ఇద్దరూ గమనించలేదు. నేను వాళ్ళకు కనిపించలేదు. కానీ వాళ్ళ మొఖాలు నాకు స్పష్టంగా కనిపిస్తున్నాయి. గొంతులు వినిపిస్తున్నాయి. అతనన్నాడు, "మీ ఆయన నాదగ్గర చాలా అప్పు చేసాడు. నాతో పాటు మరో ఇద్దరి దగ్గరా అప్పు చేసాడు. కానీ వాటన్నింటికీ నాది బాధ్యత. కానీ మీరే నా యందు కొద్దిగా దయ చూపాలి......" అతడు మాట్లాడుతూనే ఉన్నాడు. నేను వింటూనే ఉన్నాను. అమ్మ ముఖంలో భావాలు క్షణక్షణానికీ మారిపోతున్నాయి. చాలా ప్రొఫిషినల్ గా మాట్లాడుకుంటూ పోతున్నాడు.

ఒక పెద్ద శబ్దంతో అతని మాటల ప్రవాహానికి బ్రేక్ పడింది.

అతడు, తన కుడి చేతితో అతని ఎడమ చెంపను పాముకుంటున్నట్లున్నాడు.

కానీ అతని ముఖంలో బాధ ఛాయలేవీ కనిపించినట్లు లేవు. వెళ్ళిపోయే ముందు ఒకమాటన్నాడు.

"చూడు ఇంటి దగ్గర పెళ్ళీడు కొచ్చిన పిల్లకూడా ఉంది. ఆ పిల్ల పెళ్ళి మీ తాగుబోతు ఆయన ఎలాగూ చేయలేడు. కనీసం నువ్వైనా సర్దుకుంటూపోతే నీకూ, భవిష్యత్తులో మీ పిల్లలకీ మంచిది....."

మరి నేను వినలేదు. వినాలని అనిపించలేదు. అప్పటికే నాకు సమాధానం దొరికింది. ఎన్నో ప్రశ్నలకు సమాధానం చాలా సమస్యలకు సమాధానం.

నా చావు.

అవును. నేను చనిపోవాలని ఆ క్షణమే నిర్ణయించుకున్నాను.

కేవలం మీ కోసమే చనిపోవాలనుకున్నాను.

మీలోమార్పు కోసం చనిపోవాలనుకున్నాను

మీలో మార్పుతో మన కుటుంబంలో ఆనందం కోసం చనిపోవాలనుకున్నాను.

అమ్మ తడిలేని కళ్ళకోసమే నేను చనిపోవాలనుకున్నాను.

ఒక ఆత్మహత్యకు ఇంతకంటే పెద్దకారణం నాకు

కనిపించలేదు.

పరీక్ష పోయిందని, భారత్ ఓడిందని, ఉద్యోగం రాలేదని, పెంచిన తల్లి చనిపోయిందని, ఆత్మహత్యలు చేసుకొనే కంటే 'ఒక తండ్రి మార్పుకోసం, కన్నకూతురు ఆత్మహత్య' చిన్న కారణంగా కనిపించలేదు.



చావు గురించి తలుచుకుంటే బాధగా ఏమీలేదు. పైగా సంతోషం చాలా సంతోషంగా ఉంది. ఒక మంచి నిర్ణయం ఇంత సంతోషాన్నిస్తుందని మొట్టమొదటిసారిగా తెలుస్తోంది.

అయితే నా చావు చరిత్రకోసం కాదు.

నా కోసం......నా తండ్రి కోసం.....నా కుటుంబంకోసం......ముఖ్యంగా నా తల్లికోసం.

అందుకే ఎవ్వరికీ అనుమానం రాకుండా కావాలనే లెక్కలు పరీక్షలో ఫెయిల్ అయ్యాను. అందుకే ఆత్మహత్య చేసుకున్నట్టు ఉత్తరం రాసాను. ఈ విషయం నీ ఒక్కడికే తెలిసే విధంగా ఈ ఉత్తరం ద్వారా మళ్ళీ మిమ్మల్ని కలుస్తున్నాను. ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ విషయం అమ్మకు తెలీకూడదు తను తట్టుకోలేదు.

చనిపోతున్నందుకు బాధగా లేదు నాన్నా. కానీ ఒక్కటే ఆలోచన. భార్య రక్తాన్ని కూడా క్వార్టర్ లో కలుపుకొని కామెడీని జోడించి పంచగల గొప్ప మనసు నీది. అదే నా బాధంతా. ఈ ఉత్తరం చదివిన తరువాత కూడా బాధ తట్టుకోలేక మరో రెండు పెగ్గులు తాగకపోతే నాకంటే ఆనందించే వారు లోకంలో ఎవరూ ఉండరేమో. తాగాలనిపిస్తే. నేను ఈ ఉత్తరం పై పెట్టిన మందు నీకోసమే. నా చివరి బాటిల్ అయినా తాగావని చనిపోయిన నా ఆత్మ సంతోషిస్తుంది.

నా చావు నాన్నను మార్చక పోయినా, పెళ్లీడుకొచ్చిన ఒక ఆడపిల్ల భారం, ఒక కుటుంబం పై తగ్గినందుకు సంతోషిస్తాను.

ఏమో!? మారతావేమో!!?

ఏమో!? భార్య రక్తం కంటే, కూతురి ప్రాణం కనీసం ఒక గ్రాము అయినా ఎక్కువ బరువుంటుందేమో!?.

పోనీ నువ్వే సమాధానం చెప్పు నాన్నా.

భార్య రక్తం చేయలేనిది.....కూతురి ప్రాణం చేయగలుగుతుందా!!?

మారతావా నాన్నా??! శెలవు.

నాన్నకు ప్రేమతో.....

ఇట్లు

నీ.....శిశిర.

ఉత్తరం పూర్తైన తరువాత చాలాసేపు కళ్లు మూసుకున్నాను. నా కళ్ళల్లో తడి తెలుస్తూనే ఉంది. అదెప్పుడూ ఆరదు. ఆరకూడదు. ఒక కుటుంబాన్ని శిక్షించినందుకు, ఒక కూతురి ఉసురు తీసుకున్నందుకు ఆ తడి అలాగే ఉండాలి.

రాత్రి మూడున్నర దాటింది.

ఎదురుగా కప్‌బోర్డులో రెండు మందు బాటిళ్ళు, ఒకటి శిశిర చివరి బహుమతి. మరొకటి నా గెలుపుకు వచ్చిన బహుమతి. ఆనందం అనిపించింది. శిశిర ఉంటే నిజంగానే సంతోషించేది.

నా సన్మానం విషయం తెలిస్తే, పిచ్చిపిల్ల. మరీ సంతోషించేది. ఫ్యాక్టరీ విషయంలో మా విజయానికి గుర్తుగా హైదరాబాద్‌లో ఈ ఆదివారం నన్ను సన్మానిస్తున్నారు. జీరో ఫౌండేషన్ జాతీయ కమిటీ ఈ నిర్ణయం తీసుకుంది. పైగా నన్ను రాష్ట్రకమిటిలో కూడా తీసుకోవాలని నిర్ణయించింది.

నాకు ఈ సన్మానాలవీ ఇష్టం ఉండవు. కానీ ఒప్పుకున్నాను. సంతోషంతో ఒప్పుకున్నాను. కారణం నా చిట్టితల్లి శిశిర. శిశిర త్యాగం నాతోనే ఉండిపోకూడదు.

ఉత్తరం గురించి ఎవ్వరికీ చెప్పవద్దని కోరింది. చివరకు అమ్మకు కూడా. నేనూ చెప్పలేదు. నేను మారానని పూర్తిగా నిశ్చయానికి వచ్చాకే ఉత్తరం గురించి నా భార్యకు చెప్పాను. తను తట్టుకోలేకపోయింది. నన్ను అసహ్యించుకుంటుందేమో అనుకున్నాను. ఎందుకు అసహ్యించుకోదు. తన కూతుర్ని పొట్టన పెట్టుకున్న దుర్మార్గున్ని. కానీ అదేం లేదు. నన్ను గట్టిగా పట్టుకొని, చాలా సేపు ఏడ్చింది.

"నా ఉత్తరం చరిత్రకోసం కాదు." అని ఉత్తరంలో రాసినా. నా దృష్టిలో చరిత్రలో నిలవాల్సిన ఉత్తరం.

ఈ ఒక్క ప్రాణం చాలు. మరే కూతురూ, కొడుకూ నాలాంటి తాగుబోతు తండ్రికి బలికాకూడదు. తాగుబోతు తండ్రులకు ఈ ఉత్తరం.......నా గుణపాఠం ఒక వేకువ కావాలి.

ఉత్తరాన్ని కొన్ని జెరాక్స్‌లు తీయించాను. హైదరాబాద్ సభలో అందరికీ తెలియాలి. రాష్ట్రం, దేశం, చివరికి ప్రపంచం కూడా........

ఈ తాగుబోతు తండ్రిని ద్వేషించాలి........

నా శిశిర త్యాగాన్ని గుర్తించాలి.

అదే నా చివరి కోరిక.



# సమాధానం రాయలేని విద్యార్థి

-రాచపాళెం చంద్రశేఖర రెడ్డి
9440222117



అయ్యవార్లు
ఎన్నిసార్లు పాఠం చెప్పినా
అర్థంచేసుకోని
మొద్దబ్బాయినైపోయానా?
నాటకాలగురువు
ఎన్నిసార్లు నేర్పినా
రాగాన్ని పట్టుకోలేని
అర్భకుణ్ణైపోయానా?
నేను
ఎర్రగడ్డ పొరలు విప్పిచూపినట్లే
నా భార్యకు
జీవితాన్ని అర్థం
చేయిస్తున్నాననుకుంటాను
నేను
అరటిపువ్వు రేకులు వలిచి చూపినట్లే
నా బిడ్డలకు
అన్నీ అవగాహన
చేయిస్తున్నాననుకుంటాను
అయినా
ఆయన
ఎన్నిసార్లు దంచినా
పొట్టుఊడని ఆళ్ళగింజలా
నా కర్థం కానే కాదు
ఎవడోసన్నాసిగాడు
అరగని మెరుగులు మొరగవచ్చు
వాడిజన్మ రహస్యం నాకు తెలుసు
ఆయనేమిటి?
నాకు బాగా ఇష్టమైన
గడ్డపెరుగులాంటిమనిషి
ఒకే పుస్తకంలో
ఇద్దరమూ రెండు పేజీలం
ఇద్దరమూ
ఒకే తానులో పోగులం
రైతుగా మాట్లాడితే
ఇద్దరమూ కాడెద్దులం
అలవాట్లలో వలపటదాపట కావచ్చు
ఆలోచనలో ఒకే నొగలాగేవాళ్ళం
ఎదుటపడినప్పుడు
మరకలేని మల్లెపువ్వుల్లా
పలకరించుకుంటాం
తనివితీరా బావిలో ఈతకొట్టి
తృప్తిగా పైకి తేలి తలవిదుల్చుకున్నట్టు
ఊసులాడుకుంటాం
అయినా ఎక్కడో ఒక అపశబ్దం
నేను అనుకున్న గోడమీద రాసిఉంటాడు
ఎక్కడో నేను అనుకొనేచోట
ఒక మసిచుక్క పూసిఉంటాడు
ముందైనా వెనకైనా
గౌరవించడం తప్ప అన్యం ఎరుగనివాడు
ఆయన నాకిచ్చే బిరుదులు
నా నవ నాడుల్ని ఉండలు చుట్టేస్తాయి
నన్ను నిలువెల్లా ఎరిగిన అన్నయ్య
నేనూహించని ఊహల్ని
పుక్కిలించి ఉమ్ముతుంటే
నా భార్యాబిడ్డలు నాచుట్టూకూర్చొని
ఆయనేమిటో వివరించమన్నప్పుడు
నేను
ప్రశ్న పత్రం చేతికి తీసుకొని
సమాధానం రాయలేని విద్యార్థినై పోతాను.



# అనాదిగా....!

- ఎ. తిప్పేస్వామి
9000883623



అనాదిగా ఇక్కడే వుంటున్నాన్నేను
మా తాత ముత్తాతల కాలం నుంచి
వెలసింది లేదు వెలగబెట్టింది కూడా లేదు
వెలుగులేని వెలివాడల్లో వుండడం తప్ప
ఏముందని గొప్పగా చెప్పుకోను నా గురించి
గోచీని సైతం గుట్టుగా గుంజేస్తుంటే
ఎంగిలి మెతుకుల కోసం ఎగబడుతుంటే
చివరాఖరుకి చిరుదీపాన్ని చిదిమేస్తుంటే
ఇప్పటికీ ఇనుపగోడలు కడుతూనే వున్నారు
ఎలా నమ్మాలి...మీరూ మాలో ఒకరని
మీ మదిలో...మందిరంలో ఇంత చోటుందని
అడుగడుగునా అయిన దానికి కానిదానికి
అవాంతరాల అడ్డుగోడలని కడుతూనే వున్నారు అంతటా
వాడెవడో...నా పాలిట శిలా శాసనం రాస్తే
అదే పాటని అదే పనిగా ఇప్పటికీ పాడుతూనే వున్నారు
వినసొంపుగా వుందంటూ సీసంలా నా చెవుల్లో పోస్తున్నారు
నీ పరమాన్నాల కోసం పాకులాట నాకు లేదు
మరి నీకెందుకు నా కంచంలోని మెతుకుల గోల
చరిత్ర తిరగేద్దామా...? రంగువెలసిన పుటల్ని లెక్కకడదాం??.!
మూలాల ముడి విప్పుదామా...? చిక్కుముళ్ల సంగతి తెలుస్తుంది...!!



# జాషువా కవిత్వం - వేదనామాధుర్యం



ప్రొ॥ కె. ఆశాజ్యోతి
9449672394

తనవారు లేని చోటను
జనువించుక లేనిచోట జగడము చోటన్
అనుమానమైన చోటను
మనుజునకును నిలుపదగదు మహిలో
సుమతీ !

అంటాడు సుమతీకారుడు ! తనకెవరూ లేని స్థితి - చనువుగా ఎవరితో జీవించలేని పరిస్థితి - నిరంతర అవమానాలు ! ఇదీ జాషువా జీవితం ! తల్లి మాదిగ స్త్రీ - తండ్రి యాదవ కులస్థుడు ! మాదిగ స్త్రీని చేసుకున్నందుకు వెలివేసిన యాదవ కులస్థులు. వెరసీ దుర్భరమైన పరిస్థితులు. సమాజపు సూటిపోటి మాటలు భరించలేక తండ్రి క్రైస్తవ మతం స్వీకరించడంతో జాషువాకు తల్లి కులమే ఆపాదింపబడింది. క్రైస్తవులూ ఆదరించక, హిందువులూ తిరస్కరించి - అస్తిత్వమే అనుమానమైన చోట, నిరంతరం మాల - మాదిగలు జగడాలు సాగే చోటులో ఒంటరివాడై - నిస్సహాయుడై - భీతావహుడై జీవితం ప్రారంభించిన జాషువా నిలువలేని స్థితి నుండి లేచి నిలబడి తెలుగు కవిత్వానికి వెలుగు దివ్వె నిలిచాడు. తెలుగు పద్యానికి ప్రవక్తై ప్రవచించాడు. ఈ కులమతాల కాట్లాటలో విలవిలలాడిన జాషువా హైందవాన్ని ఇలా ప్రశ్నించాడు.

ముసలి వాడైన బ్రహ్మకు బుట్టినారు
నలువురు కుమారులనుట విన్నాము గాని
పసరముకన్న హీనుడభాగ్యుడైన
యైదవ కులస్థుడెవ్వరమ్మా!

మనోక్లేశానికి గురైన జాషువా కృంగిపోకుండా తన వేదనను కవితా మాధుర్యంగా మలచాడు. ఆ మాధుర్యపు లోతులను తాను కంఠదఘ్నంగా ఆస్వాదించాడు. సమాజానికి అందించాడు. అక్షరాలకు మాధుర్యం ఉంటుంది. ఆ మాధుర్యం పదాల పోహళింపులో - గమకాలలో ప్రదర్శితమవుతుంటుంది. అక్షరాలు కూర్చే భావాలు అవి కలిగించే మాధుర్యం రసాస్వాదనా యోగులందరికీ అనుభవైకవేద్యమే ! ఐతే కన్నీటికి మాధుర్యాన్ని అద్దడం ఒక్క జాషువాకే సాధ్యమైంది. దు:ఖభరితమైన, వేదనామయమైన ఏ అంశమైన జాషువా చేతిలో ఉలి చెక్కిన శిల్పంలా మాధురీ మహిమను సంతరించుకొంటుంది. జాషువా సమకాలికులెవ్వరికీ అందని హృద్యమైన కోణం ఇది. ఒక్క జాషువా మాత్రమే దర్శించగల వేదనా మాధుర్యం. గబ్బిలము, పిరదౌసి, ముంతాజు మహలు ఖండకావ్యాలలోనే కాక శ్మశానవాటిక - శిశువు, అనాథ వంటి రచనల్లో మిక్కుటంగా కనబడుతుంది. కేవలం ఈ పద్యాలలోనే వేదనా మాధుర్యం ఉంది అని చెప్పలేం. ప్రతి పద్యంలోనూ జాషువా వేదనా మాధుర్యపు శైలి ప్రస్ఫుటమవుతుంది.

ఎందరో కవులు నాటికీ - నేటికీ అక్షరానికి సొగసులద్దారు. అందాలు పొదిగారు. ఐతే అక్షరాన్ని ఏడిపించగల ధీరుడు జాషువా ! తనను ఏడిపిస్తున్నాడని అక్షరం ఏనాడూ కృంగిపోలేదు సరికదా - తాను మరింత సాన పెట్టిన వజ్రంలా మెరిసిపోయింది జాషువా చేతిలో తనలో తాను మురిసిపోయింది. జాషువా పద్యాలన్నీ మాధుర్యానికి మచ్చు తునకలే ! పరుషాక్షరాలన్నీ కోరలు తీసిన

పాములయ్యాయి జాషువా కలంలో ! ఎంత కఠిన పదమైనా మధురంగా మారిపోతుంది జాషువా రచనా చమత్కృతిలో ! జాషువా అన్నట్టుగా

*మధుర రసమును గడుపున మాటుకొన్న*
*ద్రాక్షఫల గుచ్ఛముల యందముల తూగు*
*వర కవీంద్రుని కావ్య ప్రపంచమందు*
*ప్రతి పదంబున మదికి దర్శనమొసంగు*

**– కవితా లక్షణము**

జాషువా ద్రాక్ష గుత్తి వంటివాడు. తనలోని వేదనను కవితామృతంగా మార్చి, పాఠకులను ఆస్వాదించమని అందించాడు. ప్రతీ పదంలో కవి కనబడతాడని చెప్పడమే కాదు తన కవిత్వంలో తాను ప్రతిఫలించి చూపాడు.

జాషువా ఖండకావ్యాలకు పెట్టింది పేరు. తనలోకలిగిన భావ శాబల్యతకు అక్షర రూపమిచ్చిన కళాతపస్వి. సమాజంలోని ప్రతి అవకరాన్ని వ్యతిరేకించివాడు. వక్రతలతో – వికృతాలతో కుళ్ళిపోతున్న సమాజం పట్ల, దిగజారిపోతున్న మానవ విలువల పట్ల ఆక్రోశంతో కవిత్వం వెలువరించిన కవి. అందుకే ఖండకావ్య సంపుటి (నాల్గవ)కి ముందు మాట (1950) ఇలా రాసాడు. – "ధర్మేతరాలైన స్వార్థనృత్యాలకు నేను వ్యతిరేకినని, బాపూజి, బుద్ధుడు, క్రీస్తు నడచిన మార్గంలో నేనొక అజ్ఞాత ప్రవాసినని. లక్ష్యం చేరలేని దుర్బలుడనని యెరుగుదును. కాని ప్రయత్నం దోషం కాదు గదా! విశ్వమెన్ని వెర్రి వేషాలు వేసినా మహాత్ముల ప్రేమ శంఖ ధ్వనికి మృతి లేదు. క్షితి లేదు. మరణం లేని మానవత్వాన్ని కామించు కవితా వీణపై నేను మ్రోయించు వ్యథా తంత్రులే ఖండ కావ్యాలు". రాసిన ప్రతి పద్యమూ వ్యథతో కూడుకున్నదేనని తెలుపుకున్నాడు. వ్యథకు ప్రతిరూపాలే జాషువా ఖండకావ్యాలు.

**1. జాషువా వృత్తపద్యం:**

జాషువా వృత్త పద్య రచనలో ఒక ప్రత్యేకత ఉంటుంది. నాలుగు పాదాల పద్యంలో మొదటి మూడు పాదాలలో విషయ వివరణతో విస్తరణ చేసి చివరిదైన నాల్గవ పాదంలో ఉపబలకంగా వర్ణించిన వస్తువును ఉత్కృష్ట స్థాయికి తీసుకు వెళ్ళే పద నిర్మాణం కనబడుతుంది. మూడు పాదాలలో విషయం గ్రహిస్తున్న పాఠకుడు ఒక్కసారిగా నాలుగవ పాదం చదవగానే ఉలికిపడతాడు! స్తంభించిపోతాడు! జాషువా ప్రతీ వృత్తపద్యమూ ఈ వైవిధ్యానికి – వైదగ్ధ్యానికి మచ్చుతునకే!

***ఎన్నో యేండ్లు గతించి పోయినవి గానీ, యీ శ్మశాన స్థలిన్ గన్నులు మోడ్చిన మంద భాగ్యుడొకడైనన్ లేచి రాడక్కటా! యోన్నాళ్ళీ చలనంబు లేని శయనంబే తల్లులల్లాడిరో కన్నీటం బడి క్రాగి పోయినవి నిక్కంబిందు పాషాణముల్!***

**– శ్మశానవాటిక**

మొదటి మూడు పాదాలలో విషయం గ్రహిస్తున్న పాఠకుడు ఒక వేదన – ఒక వైరాగ్యం చుట్టుముట్టి దు:ఖతరంగిత మనస్కుడై నాల్గవ పాదంలోకి అడుగు పెట్టీ పెట్టకనే జాషువా పాఠకుడి గుండెకు గురి పెట్టి బాణాన్ని వదులుతాడు. అసలే శ్మశానం ! అందులోనూ పాషాణాలు! మృదుమధురమైన వాగ్బాణం. కరగని పాషాణాలు కూడా శ్మశానంలో కన్నీళ్ళతో ఉడుకెక్కి పోయాయని జాషువ అంటున్నాడు. పాషాణం ఉడుకెక్కడం, కాగి పోవడం కవి అనంతమైన ఊహకు నిదర్శనాలైతే నాల్గవ పాదంతో పద్యాన్ని పతాక స్థాయికి తీసుకుపోవడం జాషువా కవితా శాబల్యతకు నిదర్శనం. అలాగే ఈ పద్యంలో "కన్నులు మోడ్చిన" అన్న పద ప్రయోగం చేసాడు కవి. తెలుగు సాహిత్యంలో "కైమోడ్పులు" తెలిసిన చదువరులకు "కన్నుల మోడ్పు" ప్రయోగం కన్నీటిని తెప్పించక మానదు. పాఠకులను ఏడ్పించగల హృదయవాది జాషువా!

జాషువా పద్యాలు పఠితను పట్టి పీల్చి పిప్పి చేస్తాయి. పఠనాక్రమంలో ఉన్మీలనం చేసి మనసు మూగబోయేలా చేస్తాయి. వాస్తవాలు తీవ్ర శరాఘాతాలై మెదడును అతలాకుతలం చేస్తాయి. జాషువా పద్యాలు చదువుతున్నంత సేపు నాడీ మండలంలో రక్త నాళాలు స్తంభించి పోతాయి. అచేతనమవుతాయి. అంతులేని వ్యథాభరిత – వేదనాత్మకతకు గురవుతాయి. అవ్యక్తావ్యక్త స్థితిలో అర్థనిమీలిత యోగ స్థితిని కలిగిస్తాడు జాషువా!

***నా కవితా వధూటి వదనంబునెగాదిగా జూచి రూపు రేఖా కమనీయ వైఖరులు గాంచి భళీ! భళీ! యన్నవాడై "మీదే కులమన్న ప్రశ్న వెలయించి, చివాలున లేచి పోవుచో బాకున గ్రుమ్మినట్లగును పార్థివ చంద్ర ! వచింప సిగ్గగున్ !***

**– రాజదర్శనము**

ఈ పద్యం జాషువా బ్రతికున్న నాడే కాదు నేటికీ ప్రతి ఒక్కరినీ ప్రశ్నిస్తూనే ఉంది. జాషువాను అనుకోగానే ఎవరికైనా అసంకల్పితంగా గుర్తుకు వచ్చే పద్యం ఇది. కులం పేరుతో జరిగిన అవమానం – తెలుగు సాహిత్యంలో చెరపలేని మచ్చగా మిగిలిందని – అది తెలుగు జాతికి అవమానమని తెలిపే

పద్యం!

**జాషువా కవిత్వ ఇతివృత్తం :**

జాషువా కవిత్వానికి "ఆకలి" ప్రాణం. ఆ ఆకలి జాషువాను కాల్చివేసింది. ప్రతి గుండెనూ, స్పృశించింది. సర్వ మానవ సమానత్వాన్ని - సమతను ఆశించింది. ఆక్రోశించింది. కన్నీటి చెలమలను ఊరించింది. ఆ కన్నీరు చెలియలికట్ట దాటినప్పుడు -

*వాకొనరాని గొప్ప ధనవంతుని నిద్దపు బాలరాతి గో*
*రీ కడ బారవేయబడి ప్రేలికలం బొరలాడు ప్రేతమే*
*యాకటి చిచ్చునన్ గుమిలి, యార్చి, గతించిన*
*పేదవానిదౌ*

నో కదా! వానికై వగవడొక్కండు; దాచదు కాటినేలయున్

- శ్మశానవాటిక

అంటూ అనాథ శవం కోసం దు:ఖపడే మనిషిగా, దళితులకే కాదు ప్రతీ పేదవాడికీ ప్రేమ వాత్సల్యాలను పంచిన మనీషి జాషువా!

*మనుచారిత్రము, కృష్ణ భూవిభుడు సన్మానించు నుయ్యేల పా*
*న్పున మృష్టాన్నములందు గప్పురపు దాంబూలంబులందంకురిం*
*చిన యానంద రసంబులో బొటమరించెస్; భూపతీ! పొట్ట నిం*
*డని మా బోంట్ల కలంబు లెక్కరణి విన్నాణంబు జూపించెడిన్*

- రాజదర్శనము

అల్లసాని పెద్దన మనుచరిత్ర రాసాడంటే, శ్రీకృష్ణదేవరాయల వంటి కవి రాజు కోరిన కోర్కెలన్నీ నెరవేర్చాడు కనుకనే సాధ్యమైంది. కవి కోరిన మృష్టాన్నాలే ఇచ్చాడా - కర్పూరపు తాంబూలాలే ఇచ్చాడా - ఉయ్యాల పాన్పులే సమకూర్చాడా ! అందుకే అల్లసానిలో కవిత్వం పొటమరించింది. మరి పొట్ట నిండని మా బోంట్ల కలాలలో విజ్ఞానం ఎలా ప్రదర్శితమవుతుంది అని జాషువా ప్రశ్నిస్తాడు. "స్తుతిమతియైన ఆంధ్ర కవి ధూర్జటి పలుకులకేల కలిగెనో అతులిత మాధురీ మహిమ" అన్న శ్రీ కృష్ణదేవరాయలు బ్రతికుంటే జాషువా కవిత్వం వింటే కరిగి కన్నీరవుతాడే ! ధూర్జటి పలుకుల్లో మాధుర్యం అస్వాదించిన శ్రీకృష్ణదేవరాయలు ఈ గుండెలు పిండేసే కవిత్వానికి ఏ గౌరవాలనందించేవాడో!

*రాజు మరణించె నొక తార రాలిపోయె*
*కవియు మరణించె నొక తార గగనమెక్కె*
*రాజు జీవించె రాతి విగ్రహములందు*
*సుకవి జీవించె ప్రజల నాలుకలయందు!*

**మాల - మాదిగలు :**

మాలమాదిగల మధ్య వైమనస్యాలు - స్పర్థలు గమనించిన జాషువా "గుస గుసలు" కవితలో

*మాల క్రీస్తుకన్న మాదిగ క్రీస్తుడే*
*యరవీసె గొప్పవాడనియె నొకడు*
*మాలమాదిగలకు మతమున్న దాయంచు*
*జాతి ద్వేషంబు జరిపెనొకడు !*

అంటూ

*మాల బోధకుడెన్నడో మాదిగింట*
*గుడిచినాడని, యమ్మాల గూడెమునకు*
*నెడముగా నుంచి దాహంబు నీయరనుచు*
*గుసగుసలు గల్గునిది తేల్చుకొనుట లెస్స !*

*అని తేల్చుకోమంటాడు.*

మాల మాదిగల మధ్య ఐక్యతకు, సోదర ప్రేమకు - ఆత్మీయతకు అవకాశాలు పుష్కలంగా ఉన్నా అన్నదమ్ముల మధ్య వైరం తొలగించే ప్రయత్నాలు సాగడం లేదని జాషువా భావన ! అందుకే **"ఇంటిగుట్టు" కవితలో ఇలా అంటాడు !**

*పంచములలోన మాదిగ వాడ నేను*
*పంచమీయులలో మాలవాడతండు*
*ఉభయులము క్రైస్తవ మతాన నొదిగినాము*
*సోదరత గిట్టుబాటు గాలేదు మాకు !*

ఇరు వర్గాల మధ్య ద్వేషం తార స్థాయికి చేరుతోందని దిగులు పడతాడు. వ్యథ చెందుతాడు.

*వాని గుడిసె మీద వాలిన కాకి, నా*
*గుడిసె మీద వాలగూడదెపుడు*
*కాకులందు మాల కాకి మాదిగ కాకి*
*రూఢి సేయు మా విరోధములను*

*అలాగే -*

*మతములో నొకింత మాట పొత్తే కాని*
*పొత్తు లేదు మాకు ; పొరుగు లేదు*
*సిగ్గు విడిచి హెచ్చు తగ్గుల కోసమై*
*తన్ను కొంట మాకు తప్పు లేదు !*

*అని వాస్తవాలను నిర్భయంగా తెలిపాడు !*

**ముస్లిం మైనారిటీ ఇతివృత్తం :**

జాషువాను సమాజం ఒంటరిని చేసింది. హిందువుల

గురించి రాస్తున్నాడని క్రైస్తవులు - క్రైస్తవుల గురించి రాస్తున్నాడని హిందువులు జాషువాను అవమానించారు. దారి లేని వాడై మసీదు ప్రాంగణాలలో మనుగడ సాగించాడు జాషువా ! అప్పుడే ముస్లిం సాహిత్యంతో పరిచయం ఏర్పడడం - ముస్లిం సాహిత్యం అధ్యయనం చేయడంతో ఆ సాహిత్యం పట్ల మక్కువ ఏర్పడడంతో పిరదౌసి - ముంతాజు మహల్ వంటి కావ్యాలు అత్యంత వేదనా మాధుర్యంగా - హృదయ దఘ్నంగా రాసి అఖండ కీర్తి పొందాడు జాషువా !

***దాయమన్నీల ప్రాణముల్ దీయగలిగి***
***యీయ లేదయ్యె నిజ భార్య కాయువులను***
***చండశాసనుడగు మహా చక్రవర్తి***
***ఆత్మకధికారి గాడు న్యాయంబుగాను***

**- ముంతాజుమహల్**

అంటూ భార్యను కాపాడుకోలేని చక్రవర్తి నిస్సహాయతను ఎత్తి చూపాడు.

***మృతులకు మరుజన్మంబులు***
***కృతుల కదా దేవి? యట్టి కృతి శతములచే***
***బ్రతికించి నీకు జక్కని***
***రతనాల సమాధి, మందిరము గావింతున్***

**- ముంతాజుమహల్**

అంటూ భార్య కోసం మందిర నిర్మాణం ఆలోచించాడు చక్రవర్తి. జాషువా ముంతాజు మహలు కావ్యంలో తాజుమహల్ నిర్మాణం గురించి రాస్తూ -

***కలము నందుకొను కవివరేణ్యుని మ్రోల***
***తలలు వంచు శబ్దముల విధాన***
***నాటి శిల్పి చెంత నవనీతమును బోలి***
***మెత్తదనము దాల్చె మేటి శిలలు***

**- ముంతాజుమహల్**

జాషువా పిరదౌసి ప్రతి పాషాణ హృదయాన్ని సైతం కరిగించే కమనీయ కావ్యం. పిరదౌసిలో గజనీమొహమ్మదు చర్యకి దు:ఖించిన పిరదౌసి

***ఒక్కొక్క పద్దియంబునకు***
***నొక్కొక్క నెత్తురు బొట్టు మేనిలో***
***దక్కువగా రచించితి.............అంటాడు***
***"రాజుల మీద కవి కప్పురంబు చల్లె***
***సుకవితల మీద రాజు నిప్పుకలు విసరె"***

ముంతాజు మహలు కావ్యంలో తాజమహలు నిర్మాణం గురించి రాస్తూ

"కలమునందుకొను కవి వరేణ్యుని మ్రోల
తలలు వంచు శబ్దముల విధాన
నాటి శిల్పి చెంత నవనీతమును బోలి
మెత్తదనము దాల్చె మేటి శిలలు"

అని తెలుపుతాడు.

**గబ్బిలము :**

జాషువా "గబ్బిలము" రాయవలసిన పరిస్థితులు తెలుగు సమాజంలో ఏర్పడ్డాయి. 1939 లో విశ్వనాథ "వేయి పడగలు'' ప్రథమ ముద్రణ పొందింది. 1938లో ఆంధ్రపత్రికలో ఈ నవల ధారావాహిక ప్రచురణతో సనాతన హైందవ ప్రచారకుడిగా విశ్వనాథకు ముద్రపడింది. హైందవం పంచమ జాతిని హీనంగా చూడడం భరించలేని జాషువా "నాలుగు పడగల హైందవ నాగరాజు" ను తిరస్కరించాలని, తీవ్రనిరసనను తెలపడానికి రచనే మార్గమని భావించాడు. ఏకంగా హైందవం మీదే ఎదురు తిరగవలసిన సందర్భం ఆసన్నమైంది కనుక "గబ్బిలము" కావ్య నాయకుని చేత

***"నాదు కన్నీటి కథ సమన్వయము సేయ***
***నార్ద్ర హృదయంబు గూడ కొంతవసరంబు"***

అని పలికించాడు. కేవలం పాండిత్యం - వైదుష్యం - బాషా పాటవం కలిగిన మెదడు మాత్రమేకాక గబ్బిలంతో శివునికి సందేహం పంపుతున్న కథా నాయకుడు అర్థం కావాలంటే ముందు ఆర్ద్ర హృదయం కావాలి ! అక్షరాలు ముందు మేధస్సును తాకకముందు, మేధోమథనం, జరక్క ముందు గుండెను స్పృశించాలి ! హృదయ స్పందన తరువాతే మిగిలిన అంశాలు కదలాలి - చలించాలి - ప్రతిఫలించాలి అనుకున్నాడు జాషువా ! తన ప్రయత్నం వృథా ప్రయాసే కావచ్చు ! ప్రయత్నించడం మానవ లక్షణం ! అందుకే అంటాడు -

***"అపజయంబులు విజయ గేహంబు నిలుచు***
***స్తంభములు సుమ్ము ! నీకు విచారమేల"***

అంటూ వెంటనే

***"ఓటమి లేదు నా యాతనమూరక పోదు తుఫాను హోలె నా***
***మాటలుమామహేశ్వరుల మానసమునం గదిలించి తీరు, క***
***న్నీట మునింగి పైకుబుకు నిర్మల సూక్తి ఫలింపకున్నచో***
***రాటముతో స్వరాజ్యము విరాజిలుటల్ కృతక***

ప్రచారముల్"

తన ప్రయత్నం వృథా కాదనీ, తుఫానులాంటి మాటలు ఉమామహేశ్వరుల గుండెలను కదిలించి తీరుతాయనీ, అది జరగని పక్షంలో రాట్నంతో స్వరాజ్యం వస్తుందనుకోవడం వట్టిదే ! అటువంటి ప్రచారమూ కృతకమే అంటాడు జాషువా

గబ్బిలము రచన - నాటి సమాజంలో రేపిన కల్లోలం అంతింత కాదు. "పంచముని కన్నను నీచపు జంతువేదీ" లేదు తెలుగు సమాజంలోననని వాపోతాడు. స్వాతంత్ర్యానికి పూర్వం 1941లో నిర్ద్వందంగా - నిస్సంకోచంగా - నిర్భీతితో సర్వమానవ సమానత్వాన్ని ఆశ్వాసించి - ఆకాంక్షించిన జాషువా దళిత జాతికే కాదు - మానవాళికే ఎత్తిన కేతనం !

అలాగే

పల్లెభాషలోని మాధుర్యం పట్ల జాషువాకు మమకారం. అందులోని రామణీయకత - కమనీయతశాస్త్రాలలో ఎక్కడుందనీ పురాకవితోన్మత్తులకు ఇది అర్థమవుతుందా అంటూ గ్రామీణ భాషాబ్ధిలోచవులూరించే తెలుగు పలుకులున్నాయని పులకరిస్తాడు.

**"వ్యవహారంబునభ్రష్టమయ్యు, రసభావస్ఫూర్తిగల్పించిమా**
**ర్దవముల్ప్రబ్బములెన్ని యోకలుగుశాస్త్రజ్ఞానమాత్రుల్**
**పురాకవితోన్మత్తులెరుంగజాలుదురెకుగ్రామీణభాషాబ్ధిలో**
**జవులూరించుతెలుంగుపల్కులస్వారస్యతాహాస్యమున్"**

అంటూ పల్లెజనాలనోటిభాషగ్రామ్యంకాదనీ,
మధురాతిమధురమైన తెలుగుపలుకు బళ్ళభాషనీపొంగిపోతాడు జాషువా!

**కులమతాల నిరసన :**

***మతపిచ్చి గాని వర్ణో***
***న్నతి గానీ స్వార్థ చింతనము గానీ నా***
***కృతులందుండదు, శబ్దా***
***కృతి బ్రహ్మానంద లక్ష్మి నృత్యమొనర్చున్***

**- తొలికోర్కె**

అంటాడు. ఇది జాషువా నాటి కాలపు సమాజ స్థితి గతులకు దర్పణం. తొలికోర్కె ఖండ కావ్యం 1957లో రాసింది. నాటి కాలపు ధోరణికి వ్యతిరేకంగా మత తత్వం - స్వార్థ చింతన తన రచనల్లో కనబడవని చెప్పడానికి ఎంత ధైర్యం కావాలి - వ్యక్తిగా ఎంత ఎదిగి ఉండాలి ! తన సమకాలికులు చూపించని విశ్వ మానవ లక్షణం జాషువా చూపించగలిగాడంటే ఎంతటి క్రాంత దర్శనం ఉండాలో - వ్యక్తికి ఎంతటి చైతన్య లక్షణం ఉండాలో తన జీవితాన్ని ఉదాహరణంగా చూపిన కవి జాషువా! మానవుడిగా ప్రస్థానంప్రారంభించి మనీషిగా ఎదిగిన కవి విశ్వమానవ తత్వాన్ని అలవర్చుకున్న తీరు అద్వితీయం! కుల మతాల తన్నులాటలో దళితులు - వారి చైతన్యం - వారి సామర్థ్యం - వారి శక్తి యుక్తులు వ్యర్థమవుతున్నాయని వగచాడు జాషువా ! అందుకే

ఎంత కోయిల పాట వృధయయ్యెనో కదా
చిక్కు చీకటి వనసీమల యందు
ఎన్ని వెన్నెల వాగులింకి పోయెనో కదా
కటిక కొండల మీద మిటకరించి
ఎన్ని కస్తురి జింకలీడేరెనో కదా
మురికి తిన్నెలె మీద పరిమళించి
ఎన్ని ముత్తెపురాలు ఛిన్న మయ్యెనో కదా
పండిన వెదురు జొంపముల మీద
ఎంత గంధవహనమెంత తంగెటి జున్ను
ఎంత రత్న కాంతి ఎంత శాంతి
ప్రకృతి గర్భమందు భగ్నమైపోయెనో
పుట్టరాని చోట పుట్టు కతన !

- గబ్బిలము

పద్య రచన ఏక బిగువుగా సాగి పఠిత హృదయం ఆర్ద్రతతో బరువెక్కుతూ పాదం తరువాత పాదం కదులుతూ ఒకదాని తరువాత ఒకటిగా చదివే కొద్దీ కన్ను - గుండె - మెదడు భారమవుతుంటాయి. అలా సాగుతూ పద్యాంతంలో ప్రకృతి గర్భంలో భగ్నమవుతున్నాయని కవి చెబుతుండగానే పాఠకుడు తీవ్ర వేదనకు గురవుతాడు. చివరి పాదం చేరుకోగానే అంతవరకు సాగిన పాదాలు 'పుట్టరాని చోట పుట్టు కతన' అనగానే ఒక్కసారిగా అగ్ని పర్వతం బద్దలైనట్టుగా దు:ఖం పొంగి నిలువునా మునిగి పోతాడు. కృంగిపోతాడు.

మతమౌఢ్యాన్ని జాషువా తీవ్రంగా నిరసించాడు. దేశ గౌరవ మర్యాదలు, కుల-మతాల వేర్పాట్లతో ప్రపంచదేశాల ముందు చిన్నబోతున్నందుకు కుమిలిపోయాడు. మతాల మారణహోమాలు, శతాబ్దాలుగా సాగిన వైష్ణవ - శైవ హననాలు, రక్తతర్పణాలు చరిత్రగా మిగలక కాలాలు మారినా కులాలు మారని, మతాల మౌఢ్యంవదలని మానవ లోకాన్ని చూసి - రోసిపోయి మానవాభివృద్ధికి ఈ ఘర్షణలు కళంకాలుగా భావించాడు.

*ఒకడు రుద్రాక్ష మాలికలు నెత్తికిజుట్టి*
*శివ మూర్తియై భూమికవతరించు*
*ఒకడూర్ధ్వ పుండ్రంబులురువుగా దగిలించి*
*శివ లింగమును జూచి చీదరించు*
*ఒకడు రెండును గాని వికట వేషము దాల్చి*
*పైవాడి మీద సవాలు సేయు*
*ఒకడు గంజాయి దమ్ముకు దాసుడైపోయి*
*బూడిద గురవడై పుట్టి వచ్చు*
*మనుజులార! మాది ఘనమైన మతమని*
*ఒకడు తరిమి తరిమి యుగ్గడించు*
*పెక్కు మతములిట్లు పేచీలు సాగింప*
*మార్గమేది యైకమత్యమునకు*
*అని ప్రశ్నిస్తాడు !*

కేవలం దళితుల గురించి మాత్రమే ఆలోచించాడు జాషువా అని కొందరి అభిప్రాయం. కులం పేరుతో మతం పేరుతో పీడింపబడుతున్న, అణచివేతకు గురవుతున్న – గురైన వారి పక్షపాతి జాషువా ! కృష్ణదేవరాయల ఆస్థానంలో రామరాజభూషణుడిది "కాపు కవిత్వం" అని గేలిచేసిన తెనాలి రామలింగడు గురించి

చీపర పాపర తీగల
జేపల బుట్టల్లినట్లు చెప్పెడు నీయా
కాపు గవిత్వపు గూతలు
బాపన కవి వరుని చెవికి బ్రమదంబిడునే !

అంటాడు. అలాగే "భట్టుమూర్తి"(1946) ఖండకావ్యంలో
"కాపు కవిత్వమెవరికి గమ్మదనమంచు నెన్నియో
లోపములెన్ని నిన్ను సభలో నవమానము సేయు లింగనిన్
"గోపము సేయకింక"నను కొమ్మని చక్కదనాల కబ్బపుం
గాపులు గాచిపోయితివిగా కవితా దివిజ ద్రుమంమునన్"

శతాబ్దాలుగా సాగుతున్న కులాధిపత్యపు కోరల నుండి బయటపడాలని జాషువా ఎంతో ప్రయత్నించాడు. జాషువా కవిత్వాన్ని సమాదరించిన సమాజం జాషువాను దళితునిగానే చూసింది. అందుకే జాషువా

*"కులమతాలు గీచుకొన్న గీతలజొచ్చి*
*పంజరాన గట్టువడను నేను*
*నిఖిల లోకమెట్లు నిర్ణయించిన, నాకు*
*తరుగు లేదు! విశ్వ నరుడ నేను !"*

అని ప్రకటించుకొన్నాడు. సమాజం అంగీకరించినా – తిరస్కరించినా తాను విశ్వనరుడినని తెలిపాడు.

"సర్వం పండితామోదముగా రచించితిని ముప్పది కావ్యములు" అంటూ జాషువా స్వయంగా చెప్పుకొన్నాడు. ఈ కృతుల వెనుక తీవ్రమైన కృషి ఉంది. ప్రాచీనాంధ్ర సాహిత్యాల – పురాణేతిహాసాల అధ్యయనం ఉంది. రచనలకై ఆకాంక్ష ఉంది. అంతులేని కవితా దాహం ఉంది. ఎడతెగని పోరాటముంది. ఏతావాతా తెలుగు సమాజానికిచ్చిన అమోఘమైన కవిత్వం ఉంది. హిమదమార్కధర పరిణయముతో(1917) ప్రారంభించి చిదానంద ప్రభాతము (1921), కుశలవోపాఖ్యానము (1922), రుక్మిణీ కల్యాణము (1923), శ్రీ కన్యకాపరమేశ్వరి(1924), ధ్రువ విజయము(1925), శివాజీ(1926), శ్రీ శారదా స్మృతి(1928), ఫిరదౌసి(1932), స్వప్న, అనాథ(1934), కావ్యాలుగా సాగి, ఏడు ఖండ కావ్య పాయలుగా చీలి, గబ్బిలం (I Vol: 1941, II Vol : 1946) వంటి నూతన ఇతివృత్తంలో కావ్య రచన సాగి, ముంతాజు మహలు (1943) ప్రేమ కావ్యం, కాందిశీకుని (1945) కష్టాలు, సంస్కరణాభిలాష తెలిపే – తెరచాటు (1946), సుభాసుచంద్రబోసు గురించి – నేతాజీ (1-947), హిందూ – ముస్లిం మైత్రిని తెలిపే – వీరాబాయి(1947), గాంధీ అకాల మరణంపై – బాపూజీ(1948), మాతృదేశ వీరగాథా కథనం తెలిపే – చిన్నానాయుడు(1948), ఎలిజీ – అశ్రుమంజరి (1948), గాంధీ సత్యాగ్రహ యజ్ఞ ఫలితం – స్వయంవరం(1950), మానవ జీవిత నాటకేవృత్తం – కొత్తలోకము(1957), స్వీయ జీవిత చిత్రణ – నా కథ(1962), క్రీస్తు చరిత్ర(1963), కర్నూలు పట్టణం గురించి రాసిన – రాష్ట్రపూజ(1963), ఇహపర ప్రయాణం తెలిపే రెండాత్మల కథ – ముసాఫరులు(1963), ఉరవళ్ళు పరవళ్ళతో సాగే నాగార్జున సాగర్(1966) వంటి రచనలు జాషువాకు అఖండ కీర్తిని తెచ్చిపెట్టాయి.

ఆధునిక తెలుగు పద్యానికి చీర సారెలు పెట్టి, గుండె నిండుగా ప్రేమించి, తెలుగు పద్యమనే స్త్రీమూర్తికి వడి బియ్యం చెరుగు నిండేలా పోసి సాహిత్య కుటుంబంలోకి పాదం మోపించి ఘప కీర్తిని తాను మూట గట్టుకొన్న జాషువా తిరుగులేని చైతన్య శక్తి !



# కథానిక పుట్టుక - పరిణామం

- అంపశయ్య నవీన్
9989291299



*గుణాఢ్యుడి బృహత్కథ నుండి మొదలెడ్తే మన దేశంలో భట్టి విక్రమార్క కథలు, పంచతంత్ర కథలు, కాశీమజిలీ కథలు, మదన కామరాజు కథలు, శుకసప్తతి కథలు లాంటి కథలు ఎన్నో ప్రచారంలోకొచ్చాయి. అయితే ఇవేవీ ఆధునిక యుగంలో జనించిన కథానికలకు కారణాలు కావు.*

కథలు చెప్పడం - కథల్ని వినడం మానవాళికి కొత్తదేమీ కాదు. నల్గురు వ్యక్తులు ఒకచోటికి చేరినప్పుడు అనేక విషయాలను ముచ్చటించుకుంటారు. వాళ్ళ దృష్టిలో పడిన ఏదో ఒక సంఘటనను గూర్చి చెప్పేటప్పుడు, నిజంగా జరిగిన ఆ సంఘటనకు కొంత కల్పనను కూడా జోడించి చెప్పుకుంటారు. వినేవాళ్ళకు ఆసక్తికరంగా ఉండాలన్న దృష్టితోనే కల్పనను జోడించటం జరుగుతుంటుంది. ఇలా నిజంగా జరిగిన సంఘటనలకు కొంత కల్పనను జోడించటం వల్లనే కథలు పుడ్తాయి. అయితే పూర్వకాలంలో ఈ కల్పన అనేది మరీ ఎక్కువగా ఉండేది. అది మామూలు కల్పన కాదు - అభూత కల్పనగా మారుతుండేది. అలాగే కొన్ని నీతుల్ని చెప్పడం కోసం కూడా ప్రాచీన కాలంలో కథల్ని సృష్టించేవాళ్ళు. ప్రాచీన కాలంలో జనించిన కథల్లో మాయలు, మంత్రాలు, దయ్యాలు, భూతాలు, బ్రహ్మరాక్షసులు, పరకాయ ప్రవేశాలు, జంతువులు మాట్లాడటాలు మొదలైనవన్నీ ఉండేవి. కథలు చెప్పే వాళ్ళు వాళ్ళ ఊహాశక్తికి పదునుపెట్టి ఇలాంటి అద్భుత, అభూత కల్పనల్ని సృష్టించి కథల్ని వినేవాళ్ళను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తేవాళ్ళు. గుణాఢ్యుడి బృహత్కథ నుండి మొదలెడ్తే మన దేశంలో భట్టి విక్రమార్క కథలు, పంచతంత్ర కథలు, కాశీమజిలీ కథలు, మదన కామరాజు కథలు, శుకసప్తతి కథలు లాంటి కథలు ఎన్నో ప్రచారంలోకొచ్చాయి. అయితే ఇవేవీ ఆధునిక యుగంలో జనించిన కథానికలకు కారణాలు కావు. ఇప్పుడు మనం చెప్పుకుంటున్న కథానిక లేక కథ - ఇంగ్లీషులో అయితే Short Story లేక Short Fiction అన్న ప్రక్రియను మనం పాశ్చాత్య సాహిత్యం నుండే స్వీకరించాం.

ప్రాచీన కుథలకు ఆధునిక కథలకు కొన్ని నిర్ధిష్టమైన వ్యత్యాసాలుంటాయని గమనించాలి.

ప్రాచీన కథల్లో కథ చెప్పటమే ఉంటుంది గానీ వాస్తవికత అనేది అస్సలుండదు. అభూత కల్పనలే ప్రధానంగా ఉంటాయి.

ప్రాచీన కథల్లో దేశ కాలాలు అనేవి ఉండవు. ఆ కథలు యే ప్రాంతంలో జరిగాయి, అన్ని అంశాలను ప్రాచీన కథలు పట్టించుకోలేదు.

ప్రాచీన కథల్లో తక్షణత్వం, సమకాలీనత ఉండవు. కథ ఇప్పుడు మనం జీవిస్తున్న కాలంలో జరిగిందన్న భావం - దీన్నే తక్షణత్వం అంటాం - కల్గదు. అలాగే సమకాలీన సమస్యను కథకు వస్తువుగా తీసుకోవడం కూడా జరగదు.

ఈనాటి కథ వచనంలోనే ఉంటుంది. ప్రాచీన కథలు పద్యాల రూపంలో లేక శ్లోకాల రూపంలో ఉండేవి.

కథను "పారిశ్రామిక నాగరికత ప్రపంచ సంస్కృతికిచ్చిన మహత్తర కానుక" అంటాడు. వల్లంపాటి వెంకటసుబ్బయ్య (కథాశిల్పం - పేజి4). పారిశ్రామిక విప్లవం ఇంగ్లండ్‌లో 1770లో ప్రారంభమైనప్పటికి దాని ప్రభావం ఇతర దేశాల్లోకి

– ముఖ్యంగా యూరోప్‌లోకి వ్యాపించటం 1815 నుండి ప్రారంభమైంది. ఈ విప్లవం కారణంగా ఇంగ్లాండ్‌తో పాటు యూరోప్, అమెరికా మొదలైన దేశాల్లో ఒక బలమైన మధ్యతరగతి కుటుంబాలు యేర్పడ్డాయి. వాళ్ళకు సులభంగా చదువుకోవడానికి ఒక సాహిత్య ప్రక్రియ అవసరమైంది. ముద్రణా యంత్రాలు విరివిగా యేర్పడటంతో అనేక పత్రికల ముద్రణ ప్రారంభమైంది. ఆ పత్రికల్లో సామాన్య మానవులు కూడా హాయిగా చదువుకోవడానికి అవసరమైన కథ, నవల లాంటి వచన ప్రక్రియల ప్రచురణ అవసరమయ్యింది. అంతకు ముందు సాహిత్యం మొత్తం కావ్యాల రూపంలో – అంటే శ్లోకాల లేక పద్యాల రూపంలో ఉండేది. పండితులకు తప్ప సామాన్య పాఠకులకు ఈ కావ్యాలు అర్ధమయ్యేవి కావు. కథలు, నవలలు సులభమైన అందరికీ అర్థమయ్యే వచనం రూపంలో ఉంటాయి. కాబట్టి ఈ వచన ప్రక్రియల్ని పత్రికలు విరివిగా ప్రచురించటం మొదలెట్టాయి.

**ముద్రణా యంత్రాలు విరివిగా యేర్పడటంతో అనేక పత్రికల ముద్రణ ప్రారంభమైంది. ఆ పత్రికల్లో సామాన్య మానవులు కూడా హాయిగా చదువుకోవడానికి అవసరమైన కథ, నవల లాంటి వచన ప్రక్రియల ప్రచురణ అవసరమయ్యింది.**

పాశ్చాత్య సాహిత్యంలో కథ 1832లో ఎడ్గార్ అలెన్‌పో రచించిన ''మెట్‌జన్‌గర్ స్టెయిన్'' అన్న కథతో ప్రారంభమైందని చెబుతారు. అయితే ఇంచుమించు ఇదే సంవత్సరం – అంటే 1832లో రష్యన్ రచయిత నికొలాయ్ గోగోల్ రచించిన 'ఓవర్ కోట్' అన్న కథను కూడా పాశ్చాత్య సాహిత్యంలో రచించబడిన మొదటి కథగా కొందరు విమర్శకులు భావించారు. "మేమంతా గోగోల్ "ఓవర్ కోటు"లోంచి పుట్టిన రచయితలమే" అన్నాడు మాక్సిమ్ గోర్కి?

మొన్నమొన్నటి వరకు తెలుగులో ఆధునిక కథారచన 1910లో గురజాడ అప్పారావు రచించిన "దిద్దుబాటు" అన్న కథతో ప్రారంభమయిందని అనుకునేవాళ్ళం. అయితే 1902లోనే భండారు అచ్చమాంబ రచించిన "ధనత్రయోదశి" అన్న కథను తెలుగులో రచించబడిన మొదటి కథ అని ఇవ్వాళ్ళ విమర్శకులందరూ అంగీకరిస్తున్నారు. అయితే బండారు అచ్చమాంబ "ధనత్రయోదశి" కథను గ్రాంథికంలో రాశారు. అందువల్ల చదవటం కొంచెం కష్టంగా ఉంటుంది.

ముదిగంటి సుజాతారెడ్డి గారు తెలుగులో రచించబడిన మొట్టమొదటి కథను గూర్చి చెబుతూ మాడపాటి హనుమంతరావు రాసిన "హృదయశల్యము" అన్న కథే మొదటి కథ అన్నారు. నిజానికి ఈ కథ 1912, జనవరి 'ఆంధ్రభారతి'లో ప్రచురించబడింది. గురజాడ అప్పారావు రచించిన 'దిద్దుబాటు' కథ కూడా ఆంధ్రభారతిలో 1910లో ప్రచురించబడింది. అయితే ఆదిరాజు వీరభద్రరావు గారు "మాడపాటి హనుమంతరావు కథను 'ఆంధ్రభారతి'కి గురజాడ కథ ''దిద్దుబాటు'' కంటే ముందే పంపించారని, యే కారణం చేతనో ఆ పత్రిక వాళ్ళు "హృదయశల్యం" కంటే ''దిద్దుబాటు''ను ముందు ప్రచురించి ఉంటారని సుజాతరెడ్డి గారు అభిప్రాయపడ్తున్నారు. "హృదయశల్యం" కథ కూడా గ్రాంథికంలో రచించబడింది.

ఆశ్చర్యం కల్గించే విషయమేమిటంటే ఈ మూడు కథలకు చాలా పోలికలుండటం.

"ధన త్రయోదశి" కథలో భార్య తన భర్తను తప్పుడు పనులు చెయ్యకుండా ఆపేయ్యటం – తర్వాత ఆ భర్త పనిచేస్తున్న షాపు యజమాని, అతడెలాంటివాడో పరీక్షించటం కోసం ఓ నాటకం ఆడటం – ముఖ్య సంఘటలు. ఓ పేద కుటుంబం – భర్త నెలకు పదిరూపాయల జీతం ఇచ్చే ఒక షాపు యజమాని లక్ష్మీపూజ చేస్తూ తన దగ్గరున్న బంగారు నగలన్నింటిని లక్ష్మీదేవి పటం ముందు పెట్టి పూజ చేస్తాడు. ఆ షాపులో పనిచేస్తున్న ఇంకో ఉద్యోగస్తుడు ఆ భర్తతో ఓ బంగారునగ దొంగలిస్తే నీ దరిద్రమంతా పోతుందని అతన్ని దొంగతనానికి ప్రోత్సహిస్తాడు. రేపు కూడా ఈ నగలిలాగే ఉంటాయి. కాబట్టి రేపైనా సరే నువ్వు ఓ నగను దొంగతనం చెయొచ్చునని చెప్పి ఆ భర్త ఇంటికి వెళ్ళి అతని భార్యకు తనను దొంగతనం చెయ్యమని తన తోటి ఉద్యోగస్తుడు ప్రోత్సహిస్తున్నాడని చెబుతాడు. ఆ భార్య వెంటనే "నువ్వు దొంగతనం చేస్తావా" అని ఆ భర్తను చీవాట్లు పెట్టి అలాంటి తప్పుడు పనులు చెయ్యొద్దని, రేపు వెళ్ళగానే వాళ్ళిచ్చిన ఆ వంద రూపాయల నోటును వాళ్ళకే ఇచ్చేసి నేనలాంటి వాణ్ణి కానని చెప్పేసిరండని చెబుతుంది. ఆ భర్తను ఆ మర్నాడు తన యజమాని దగ్గరికి వెళ్ళి నేను దొంగతనం చేసేవాడిని కానని, మీరిచ్చిన వంద రూపాయల నోటును మీకు ఇచ్చేస్తున్నానని చెప్పేస్తాడు. అప్పుడు యజమాని నువ్వెలాంటి వాడివో తెలుసుకోవటానికే తను, తన దగ్గర పనిచేసే ఇంకో ఉద్యోగి కలిసి ఈ నాటకమాడామని చెప్పి నువ్వు చాలా మంచివాడివని రుజువయ్యింది కాబట్టి నీ జీతాన్ని 10 నుండి

# మార్చి నెల పురస్కారాలు





| పుష్కర కెరటం | నిర్బంధంలో |
|---|---|
| కథకు: రూ.700/- | కవితకు : రూ .500/- |
| రచయిత : చల్లా సురేష్ కుమార్ | రచయిత : అనంతోజు మోహన్‌కృష్ణ |

సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

20కి పెంచుతున్నానని, అలాగే నీకిచ్చిన ఆ వంద రూపాయల నోటును నీకే ఇచ్చేస్తున్నానని చెబుతాడు. ఆధునిక కథకుండాల్సిన లక్షణాలన్నీ ఈ కథకున్నప్పటికీ కఠిన గ్రాంథికంలో రాయబడటం వల్ల ఎక్కువమంది పాఠకులు ఈ కథను చదివి ఆనందించలేకపోయారు.

> ఈ మూడు తెలుగు ప్రారంభ కథల్లో భర్తలకు బుద్ధి చెప్పటానికి భార్యలో లేక ఇతరులో నాటకం ఆడటం అనేది ముఖ్య సంఘటన కావడం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది

గురజాడ అప్పారావు రాసిన "దిద్దుబాటు" కథలో కూడా ఒక భార్య వేశ్యాలోలుడైన తన భర్తకు బుద్ధి చెప్పటానికి చిన్న నాటకం ఆడటమే ప్రధాన సంఘటన. అప్పారావు మొదలు ఈ కథను గ్రాంథికంలో రాసినప్పటికి తర్వాత వ్యావహారికంలోకి మార్చటం వల్ల చాలామంది పాఠకులు ఈ కథను సులభంగా చదవగల్గారు. ప్రారంభ కథగా చెప్పబడుతున్న మూడో కథ : "హృదయశల్యం"లో కూడా పై రెండు కథల్లోలాగే ఒక నాటకం ఆడటం ఉంటుంది. అయితే దీంట్లో సమకాలీనత లేకపోవడం.... ఎప్పుడో కాకతీయులు ఆంధ్రదేశాన్ని పరిపాలిస్తున్న కాలంలో ఈ కథ జరిగినట్టుగా చెప్పబడటం వల్ల దీనికి తెలుగులో రచించబడిన మొదటి కథ అన్న గౌరవం దక్కే అవకాశం లేదు.

ఈ కథలో కూడా ఓ భార్యాభర్తల జంట.... తన భార్య విపత్కర పరిస్థితుల్లో పరపురుషుణ్ణి కౌగలించుకున్న కారణంతో ఆ భర్త ఆ భార్య శీలాన్ని శంకించటం.... తర్వాత ఆమెను కౌగలించుకున్నది. పరపురుషుడు కాదు... పురుషవేషంలో ఉన్న స్త్రీ అని తెలియడం... ఆ స్త్రీ ఎవరో కాదు... ఆ రోజుల్లో కాకతీయ సామ్రాజ్యాన్ని పాలిస్తున్న రుద్రమదేవి అని తెలియడం... నీ భార్యను నువ్వెలా చూస్తున్నావో తెలుసుకోవడం కోసమే నేనీ నాటకం ఆడానని రుద్రమదేవి ఆ భర్తకు తెలియజేయడంతో కథ సుఖాంతమౌతుంది.

ఇలా ఈ మూడు తెలుగు ప్రారంభ కథల్లో భర్తలకు బుద్ధి చెప్పటానికి భార్యలో లేక ఇతరులో నాటకం ఆడటం అనేదే ముఖ్య సంఘటన కావడం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది.

1902 తర్వాత గానీ లేక 1910 తర్వాత గానీ తెలుగు కథకు ప్రారంభ సంవత్సరంగా తీసుకుంటే ఆనాటి నుండి ఈనాటి వరకు లక్షకుపైగా తెలుగు కథలు ప్రచురించబడ్డాయని చెప్పొచ్చు. వాటిల్లో జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన కథలు కూడా ఎన్నో ఉన్నాయి.

తెలుగు సాహిత్యంలో ఒకప్పుడు - అంటే స్వాతంత్ర్యం తర్వాత నవలకే ఎక్కువ పాఠకాదరణ లభించింది. కానీ 1990 నుండి టెలివిజన్ ఛానెళ్ళు కథాత్మక సీరియల్స్‌ని ప్రసారం చెయ్యడం ప్రారంభించటంతో నవలల్ని చదివే పాఠకుల్లో చాలామంది టీ.వీ. సీరియల్స్ చూడటానికి అలవాటు పడిపోయారు. దాంతో ఇప్పుడు నవలల్ని చదివేవాళ్ళ సంఖ్య గణనీయంగా తగ్గిపోయింది. కానీ కథలకు మాత్రం పాఠకాదరణ తగ్గలేదనే చెప్పాలి. ఈ హైటెక్ యుగంలో మానవుల జీవితం చాలా వేగవంతమైపోయింది. ప్రతీదీ త్వరగా జరిగిపోవాలి. కథ కొద్ది పేజీల్లోనే ముగుస్తుంది కాబట్టి కథను వేగంగా చదివేయవచ్చు. ఈ కారణం చేతనే ఈ రోజుల్లో సాహిత్య ప్రపంచంలో కథకే పాఠకులు అగ్రతాంబూలం పడ్తున్నారు.

**(18-11-2015 నాడు తెలంగాణా సారస్వత పరిషత్తు వారు ఏర్పాటుచేసిన కథకుల వర్క్‌షాపులో చేసిన ప్రసంగం)**



# చీకటి ఔదార్యం

- తప్పెట ఓదయ్య
9441641702

చీకటి మెల్లగా కమ్ముకుంటుంది.
నగరం నిదురలోకి జారుకుంటుంది.
చిన్న చితక సప్పుడుదప్ప
అంతా కాముష్.... నిశీధిలో
ఔను మరి!... చీకటంటే మాటాలా...
అందరికి జంకే, భయానకమే...
చీకట్లో కొన్ని తలలు తారుమారవుతాయ్
రాతలు తలకిందులవుతాయి.
చేతలు - చేతులు మార్చొచ్చు.
ఏదైనాగావచ్చు, ఎన్నో, ఇంకెన్నో
వింతలు, విషాదాలు, కష్టాలు, కాఠిన్యాలు,
అరాచకాల నెన్నో భరిస్తుంది - చీకటి,
చీకటికి గుండెనిబ్బరం, ధైర్యమెక్కువ,
మొండితనము - మెండుగానే,
బండల్లో బండగా, కట్టెల్లో కట్టెగా
ఏ పాత్రలోనైనా - ఇట్టే వొదిగిపోతుంది
లోకం, లోతుల్ని పసిగడుతుంది.
చీకటి ఏంజేస్తదోనని - ఏవోశంకలు
అనుమానాలు, జంకు...
చీకటితో, సోపతి పొసగదు - మనకి,
అంతగా మనసొప్పదు,- అందునా
మట్టి మసిబొగ్గులా, ఆకారము.
అంతగా ప్రేమించేదెవరు - ఆర్తిగా,
అక్కున జేర్చుకున్నదెవరు,
నిజమే! దాని గుణమేగంత, యంటూ
నిందజేస్తామ్! నినదిస్తాం,
చీకట్లోకి నిమిషము చూడని మనం
తెలివిగల్లోలం మనుకుంటాము,
ఎంతైన తెల్లగున్నోళ్ళం కదా!?
ఎప్పుడు తెలుపు గురించే చర్చ, - నలుపు
అక్కరలేదంటూ.. నవ్వుతూ.. వెకిలిగా
ఎన్నిపాడు పనల్జేసిన-మనకొలెక్కన
రాజ్యమనదే- రాజరికం మనదే,
ఏదైన చేయొచ్చు, తిమ్మిని-బమ్మిగా,
విజ్ఞులం, గనుక...
మితిమీరిన ఆహంభావం
శృతిమించుతున్న విధ్వంసం
ధృతిమించిన, ఎవ్వారం-చెత్తగా,
కుప్పలు, కుప్పలుగా, రోడ్డంతా, కంపు
కంపుగా, కలగూరగంపగా,
చెత్తా చెదారంగా



మెదడున్నోళ్ల-మోటుపనుల్జూసి,
చీకటి - పగలబడి నవ్వుతుంది.
విజ్ఞానమృగాల రాజ్యంలోని -
అజ్ఞాన ఆరాచకాలను
బేరీజువేస్తూ...
మెదడు లేనోళ్ళన్ని.. మొరటోళ్ళన్ని
నల్లోళ్ళన్ని మనం- గెంటేసినోళ్లను
చేతులిచ్చి ఆదుకుంటుంది.
తనివిదీర ముద్దుజేస్తుంది - చీకటి
ప్రేమ దీర వీపు నిమ్రుతుంది.
అక్కున జేర్చుకుని - ఎదల
దాసుకొంటుంది.
భుజం తడుతూ - భరోసనిస్తూ,
భయం వీడమంటుంది.

*  *  *

అర్ధరాత్రి అపరారితి లో - ఆర్తితో కొన్ని
చేతులు
అలలు అలలుగా కదులుతున్నవి.
చీపురు కర్రలై పాకిని చిమ్ముతాయి.
కొన్నిచేతులు మూడు గీరల - మురికి
డబ్బాల బండ్లవుతాయి
కొన్ని చేతులు కటిక చీకటిలో -
కాగడలవుతున్నవి
ఎన్నో చేతులు కలసి ఎంతో - ఎట్టిజేసి,
ఎండిన కడుపుతో మట్టిని
నింపుకుంటాయి.
కంపును వొంటికి సెంట్‌గా
రాసుకుంటాయి.
రోడ్డు రోడ్డును గల్లిగల్లిని - అద్దంలా
మెరుగు బెడుతూ,
చెమట-చుక్కల- హత్తుర్లద్దుతున్నవి.
రోతనంత సాపుజేసి - ఆయాసంతో
రొప్పుతూ,
కుళ్ళికృశిస్తూ, అంతుచిక్కని,
రోగాలతో కాపురము జేసత్తూ -
తరిగిపోయే ఆయువుతో
కాలి ఆవిరవుతున్న - దీటిలివి.
లేకిని జేస్తూ, పొట్ట నిండక చస్తూ -
రోడ్లపై చీపుర్లై
నడుస్తున్న శవాలవి..
తెల్లవారి దగదగ సొగసుల, సోయగంలో
మెరుపుకోల్పోయిన నల్లతీగలవి,
బాహ్యప్రపంచం హేయమైన, -
అమానవీయ విలువల్లో,
శిధిలమవుతున్న సమాధులవి
ఏ స్వార్ధమెరుగుని - కటిక చీకటిని -
ప్రేమించే
మట్టి హృదయాలవి
కొన్ని కొన్ని చేతులు కలిసి-
ఎట్టి బతుకుల ఎదిరి కాగడలవుతాయి.
అద్దాల మేడను గూల్చే - నిరసన
జ్వాలలవుతాయి.
సమాధుల పక్కనే - నిను పాతరేసే
తట్టపారలవుతాయి.
అవి - బతుకుల్లో వెలుగుచూడని - మట్టి
మనుషుల
చేతలవి... ఎట్టె జేసి కాయలుగాని
కృశిస్తున్నా
బక్కపల్చని జీవితాలవి..
జెర గౌరవించడం నేర్చుకో,
శ్రమ సౌందర్యము - మనిషి కోణంలో
జూడమని,
మనీకోణంలో కాదని - విన్నవిస్తున్న నీ
చేతులవి,
ఆలోచించుకోసారి? చీకటి బతుకులను
చీకటిలా ఔదార్యము జూపు, జెర!



కథ

# అధ్యయనం

- జయంతి పాపారావు
0891-2557961



**నా** మిత్రుడు, ప్రొఫెసర్ చైతన్య విద్యార్థులకు వుచితంగా కౌన్సెలింగ్ క్లాసులు నిర్వహిస్తాడు. అతడు ప్రముఖ సైకాలజిస్టు. ఏ విద్యార్థికి ఏమి చదవాలనుందో, ఎందుకు అదే చదువు చదవాలనుకుంటున్నాడో, ఆ విద్యార్థిచేత అందరి విద్యార్థులముందు చెప్పిస్తాడు. తోటి విద్యార్థులు ఇతడి ఆలోచనలు పంచుకుంటారు. అతడిలో ఆసక్తి వున్న చదువుకి ఏ ప్రవేశ పరీక్షలు రాయాలో, ప్రవేశ పరీక్షలకి ఏ విధంగా తయారుకావాలో, ఏ పుస్తకాలు ఉపయోగపడతాయో, ప్రణాళికాబద్ధంగా ఏ విధంగా తయారుకావాలో, ఉద్యోగ అవకాశాలు ఏమిటో, మున్నగు పలు విషయాలు వివరంగా చెప్తాడు. ఆ తరువాత, ఆ విద్యార్థులు ప్రణాళికాబద్ధంగా చదువుతున్నారా లేదా తెలుసుకుంటారు. ఎప్పటికప్పుడు, సూచనలు, సలహాలు ఇస్తాడు. వాళ్ళల్లో ఆరోగ్యకరమైన ఆత్మవిశ్వాసం పెంపొందిస్తాడు. చదువు నేర్పడమంటే, విద్యార్థుల్లో చదువుపట్ల అభిరుచి, ఆసక్తికి, ఆత్మవిశ్వాసం, పట్టుదల పెంచడమే అంటారు. కొన్నేళ్ళ నుంచి విద్యాసేవ ఉచితంగా చేస్తున్నాడు. విద్యార్థులు గొప్ప సమాజ నిర్మాతలు కాగలరనీ, కావాలనీ విశ్వసిస్తాడు.

మేం తరుచు కలుసుకుంటాం. కలుసుకున్నప్పుడల్లా ఎవరో ఒక విద్యార్థి గురించి మాట్లాడుతారు. విద్యార్థుల ఆలోచనా విధానంలో వస్తున్న సానుకూల మార్పులు గురించి చెప్తాడు. మనిషి నిరంతర నిత్య విద్యార్థి అంటాడు.

■■■

వచ్చీరాగానే, చైతన్య కౌన్సెలింగ్ సందర్భంలో ప్రదీప్ అనే విద్యార్థి చెప్పినమాటలు నాకు చెప్పడం ప్రారంభించాడు.

“మనిషి జీవితంలో సుఖాలతో పాటు, కష్టాలూ, బాధలూ కూడా వుంటాయి. ఆ కష్టాల్నీ, బాధల్నీ కుటుంబ సభ్యులూ, తోటి మనుషులూ, సమాజం ఎంతో కొంతమేరకు ఏదో విధంగా పంచుకుంటారు. ఆ విధంగా ఎవరూ పంచుకోలేని కొన్ని బాధలుంటాయి! అవే రోగాలు! ఆ బాధలను వైద్యులు మాత్రమే పంచుకోగలరు; నిర్మూలించగలరు! అందుకే, నేను మెడిసిన్ చదవాలనుకుంటున్నాను” అన్నాడు. నేను ఇవ్వగలిగిన సూచనలు, సలహాలు ఇచ్చి, ప్రణాళిక వివరించాను. కష్టపడి చదివాడు.

పేరున్న మెడికల్ కాలేజీలో సీటు వచ్చింది. ప్రతిభావంతుడిగా పేరు తెచ్చుకున్నాడు. విద్యార్థి నాయకుడయ్యాడు. అది కాదనలేం; అయితే – డబ్బు లేకుండా కూడా చాలా మంచి పనులు మనం చాలా చేయగలుగుతాం; ఆ దిశలో సంకల్పించాలి, అంతే! సక్రమ మార్గాల్లో మన బాగుతోపాటు, తోటి మనిషి, సమాజం బాగుకోసం, పనిచేయగలిగే అవకాశాలు మన వైద్యవృత్తిలో ఎన్నెన్నో వున్నాయి" అని తోటి విద్యార్థుల్లో స్ఫూర్తి కలిగిస్తాడు. సెలవుల్లో తోటి విద్యార్థులతో కలిసి గ్రామాల్లోకి వెళ్ళి ఉచితంగా సేవచేస్తాడు. విద్యార్థులు చందాలువేసి, ఆ డబ్బుతో మందులుకొని తీసుకువెళ్తాడు. "ఈ బాబుతో అయిదు నిమిషాలు మాట్లాడితేసాలు, రోగం దానంతటదే పోద్ది; ఠక్కున నెగిసి గూకుంటారు; పదినిముసాల్లో పెరుగెడతా నంటాడు" అని గ్రామ ప్రజలు సంతోషపడతారు. వైద్య రంగంలో వాస్తవ పరిస్థితులు ఏ విధంగా వున్నాయో అధ్యయనం చేస్తున్నాడు. అప్పుడప్పుడు వచ్చి కలుస్తాడు. కళ్ళతో చూస్తున్న వాస్తవాలను చెప్తాడు. ఏఏ మార్గాల్లో ఎన్నెన్ని విధాలుగా వేలకువేలు, లక్షలకు లక్షలు దోచుకుంటున్నారో ఆవేదనతో చెప్తాడు. పేదల కిడ్నీలు వంటి అవయవాలు దొంగిలించి, కోట్లమీద దోపిడీ చేస్తున్న వైనాన్ని వివరిస్తూ, ఆవేశంతో ఊగిపోతాడు. ఈ ఆర్థిక ఉన్మాదులపట్ల, ఈ ఆర్థిక తీవ్రవాదుల పట్ల సమాజం ఎందుకు మౌనంగా వుంటుంది?? చూస్తూ కూడా రాజ్యం ఎందుకు కళ్ళు మూసుకుని, చేతులు ముడుచుకుని కూర్చుంటుంది!? ఆ విధంగా ఆవేదనతో ప్రశ్నిస్తాడు. జవాబులు కూడా మీరే వెదుక్కోవాలని నేను అంటూ వుంటాను.



ఆ మాటలు చెప్పి, టైము చేసుకుని, దిగ్గున లేచి నిలబడ్డాడు. సమయం విలువ తెలియని వానికి జీవితం విలువ తెలియదని, వెంటనే వెళ్ళిపోయాడు.

■■■

నిండుపున్నమినాడు నింగి నిర్మలంగా చిరునవ్వు నవ్వినట్లు చిరునవ్వు నవ్వుతూ చైతన్య వచ్చి, నా ముందు కూర్చున్నాడు. విద్యార్థులు ఏమి చదవాలో చాలా ముందుగానే నిర్ధారించుకుంటున్నారు; ఇది చాలా మంచి పరిణామం. సుధీర్ అనే విద్యార్థి చెప్పిన మాటలు మీకు వినిపిస్తాను – అని చైతన్య చెప్పడం ప్రారంభించాడు.

"మా తాతగారు న్యాయవాది. ఆయన చెప్పిన మాటలు కొన్ని ముందుగా చెప్తాను. బ్రిటిషువారి చట్టాలూ – రూల్స్ – రెగ్యులేషన్స్ – పాలసీ – అడ్మినిస్ట్రేషన్ – గవర్నెన్స్ – మున్నగునవి వారి సామ్రాజ్యావాద లక్ష్యాలకు అనుగుణంగా రూపకల్పన చేసుకున్నారు... అవి ప్రజాస్వామ్య వ్యవస్థలకు పనికిరావు... మనకు స్వాతంత్ర్యం వచ్చింది... ప్రజాస్వామ్యం వచ్చింది... అయితే, మన ప్రజాస్వామ్య లక్ష్యాలకూ, మన ప్రజల ఆకాంక్షలకూ, ప్రజాస్వామ్య ఫలాలు అట్టడుగు ప్రజలకు చేరే విధంగానూ, మనం కొత్త ప్రజాస్వామ్య చట్టాలూ – అడ్మినిస్ట్రేషన్ – గవర్నెన్స్ – మున్నగునవి నిర్మించుకోలేకపోయాం... కొద్దిపాటి మార్పులూ, చేర్పులూ చేస్తూ, బ్రిటిషు వారి చట్టాలు, పద్ధతులూ కొనసాగిస్తున్నాం. అందువల్ల, ప్రజల అణచివేత – అధికార దుర్వినియోగం – అవినీతి – దోపిడీ – పేదరికం – మున్నగునవి కొనసాగుతూ వస్తున్నాయి... అదంతా అంతిమంగా మన ప్రజాస్వామ్య వైఫల్యానికి దారితీసింది... ప్రజాస్వామ్య ఫలాలు యిప్పటికీ ప్రజలకు చేరలేదు... కొందరి గుప్పిట్లోనే వుండిపోయాయి... ఆ విధంగా మా తాతగారు చెప్తూ వుంటారు. ఇంకా చాలా విషయాలు చెప్తూ వుంటారు... ప్రజాస్వామ్య వ్యవస్థలో న్యాయవ్యవస్థ కేవలం న్యాయ నిర్ధారణకూ పరిమితమై పోదు... ప్రజాస్వామ్య బాధ్యతలు చాలా వున్నాయి... వివక్ష నిర్మూలనం; అవినీతి నిర్మూలనం; దోపిడీ నిర్మూలనం; ఆర్థిక ఆర్థికేతర నేరాల నిర్మూలన; పేదరిక నిర్మూలనం; ప్రజా హక్కుల పరిరక్షణ, ప్రజల అభివృద్ధి – మున్నగు రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక అంశాల్లో న్యాయ వ్యవస్థ కీలకపాత్ర పోషిస్తుంది. ఆ దిశలో న్యాయవ్యవస్థలో మౌలికమైన మార్పులూ, సంస్కరణలూ జరగాల్సి వుంది. ఆ విధంగా మా తాతగారు చాలా విషయాలు చెప్తారు. ఆ దిశలో నాకు పని చేయాలనుంది. నేను – లా – చదువుతాను. నేనేకాదు, మరికొంతమంది కూడా – లా – చదవాలనుకుంటున్నారు. అంతేకాదు, మా తాతగారి లైబ్రరీలో అయిదు లక్షలకు పైగా

విలువ గల చట్టాలూ, చట్టాల సవరణలూ, కోర్టుల తీర్పులూ, లా జర్నల్స్, ప్రముఖుల చర్చలు - చాలా గ్రంథ సంపద వుంది. అవన్నీ మాకు బాగా ఉపయోగపడతాయి" - ఆ విధంగా వివరంగా చెప్పి, అందర్నీ ఆశ్చర్యపరిచాడు. సూచనలూ, సలహాలూ, ప్రణాళికలూ వాళ్ళకి ఇచ్చాను. కష్టపడి చదివారు. పేరున్న మంచి లా కాలేజీలో చేరారు. కష్టపడి చదువుతూ, క్షేత్రస్థాయి అధ్యయనాలు కూడా చేస్తున్నారు. సుధీర్ అప్పుడప్పుడు వచ్చి కలుస్తాడు. తల దిమ్మెక్కిపోయే నిజాలు చెప్తాడు. ఎంతో ఉన్నత చదువులు చదివి, సమాజం పట్ల ఎంతో బాధ్యత వున్నవాళ్ళు, అక్రమ మార్గాల్లో డబ్బు ఎందుకు సంపాదిస్తారు? ఆ డబ్బుతో జీవితంలో ఏం సాధిద్దామనుకుంటారు? నేరగాళ్ళకు శిక్షపడకుండా కాపాడ్డమే లక్ష్యమా? పేదలకు న్యాయం దక్కకుండా పనిచేయడమే ధర్మమా? ఇదంతా సమాజ ద్రోహమనీ, ప్రజాద్రోహమనీ ఎందుకు అనుకోరు? చదివిన చదువునీ, నేర్చుకున్న విలువలనూ బుగ్గిలో పోస్తారా? ఆ విధంగా సుధీర్ ఆవేదన పడతాడు. అధ్యయనం అంటే వాస్తవాలు సేకరించడం మాత్రమే కాదు, పరిష్కార మార్గం, పరివర్తన మార్గం కనుక్కోవాలని హెచ్చరిక చేస్తాను!



అటూ ఇటూ చూస్తూ, మంచినీళ్ళు తాగాడు. సమయం విలువ తెలియనివాడు జీవితంలో ప్రేమ విలువ తెలుసుకోలేడని నిర్మలంగా చిరునవ్వు నవ్వుతూ, వడివడిగా వెళ్ళిపోయాడు.

■■■

చైతన్య వచ్చాడు; కూర్చున్నాడు; అటూఇటూ చూశాడు; నా మొహంలోకి చూశాడు; నాచేతిలో వున్న పుస్తకం తీసుకుని పేజీలు తిప్పాడు; కాఫీ తాగుతూ, సతీష్ అనే విద్యార్థి చెప్పిన మాటలు చెప్తున్నాడు. "మా నాన్నగారు నన్ను సివిల్ సర్వీసెస్ వున్నతాధికారి కావాలని చాలాసార్లు చెప్పారు. అది నాకు యిష్టంలేదు. ఐ.ఎ.ఎస్. అధికారి అంటే అంతకంటే పెద్ద వుద్యోగం, మంచి వుద్యోగం మరేదీ లేదన్నంత గుర్తింపూ,



గౌరవం వుండేది. యిప్పుడదిలేదు. ఇంజనీరింగ్, మెడిసన్ మేనేజ్‌మెంటు చదవినవాళ్ళకి ఉద్యోగ అవకాశాలుబాగా వున్నాయి. విదేశాల్లో కూడా ఉద్యోగాలు దొరుకుతాయి. జీతాలు ఎక్కువగా వస్తాయి. అందువల్ల, సివిల్ సర్వీసుల పట్ల మోజుపోయింది. దానికితోడు, మన రాజకీయ వ్యవస్థ పూర్తిగా అవినీతి దోపిడీల్లో కూరుకుపోయింది. అధికార్లను కూడా అందులో భాగస్వాములనుచేస్తూ, జైళ్ళలోకి పంపిస్తున్న దుస్థితి కనబడుతుంది. అందువల్ల, సివిల్ సర్వీసులు అంటే యువతరంలో భయం పట్టుకుంది! ఇంజనీరింగ్ అయిపోయాక, విదేశాల్లో ఎం.ఎస్. చేయాలనుకున్నాను. కానీ యిప్పుడు నేను నా ఆలోచన మార్చుకున్నాను... ఇంజనీరింగ్ చదువు, నిర్లక్ష్యం చేయకుండా, సివిల్ సర్వీసెస్ పరీక్షలకు తయారవుతున్నాను... చిన్న సంఘటన నా ఆలోచనలో మార్పు తెచ్చి, మలుపు తిప్పింది... మాకు చిన్న వ్యవసాయం వుంది. హుద్‌హుద్ తుపానువల్ల ఎనభై టేకుచెట్లు కూలిపోయాయి. అవి, తుపానువల్ల కూలిపోయాయని సర్టిఫికెట్ కోసం పదిరోజులు చుట్టూ తిప్పుకుని, రెండువేలు లంచం తీసుకున్నాడు. ఆ తరువాత ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌లో పరిమిట్ల కోసం నెలరోజులు ఆఫీసుచుట్టూ తిరుగుతూ వేలమీద లంచం యివ్వాల్సి వచ్చింది. భూమి హక్కు పాసు పుస్తకాలకోసం నెలల తరబడి ఆఫీసు చుట్టూ తిరిగి వేయి లంచం యివ్వాల్సి వచ్చింది. చిన్న రైతులు అందరి పరిస్థితీ ఇదే! నూటికి నెలకి మూడురూపాయల నుంచి, అయిదురూపాయల వరకూ వడ్డీకి అప్పుతెచ్చి లంచాలు యిస్తున్నారు. ఈ పరిస్థితి కళ్ళారా చూశాక, నా ఆలోచనలో మార్పు వచ్చింది. దిగువ స్థాయిలో కూడా క్రూరంగా వున్న అవినీతిని నిర్మూలించడంలో శక్తివంచన లేకుండా పనిచేయాలని, అందుకోసం ఐ.ఎ.ఎస్. కావాలని పట్టుదలగా చదువుతున్నాను... ఉన్నతాధికారవర్గం నిజాయితీతో, ధైర్యంతో పనిచేస్తే, రాజకీయ రాజకీయేతర పెట్టుబడిదారీ వర్గాల దోపిడీని కూడా కొంతవరకైనా అడ్డుకోవచ్చు... ... ..." ఆ విధంగా సతీష్ వివరంగా మాట్లాడి విద్యార్థుల్లో ఆలోచనలను వుత్తేజరిచాడు. సతీష్‌ని నేను అభినందించాను. ఆశించిన లక్ష్యం నెరవేర్చుకోవడం కోసం ఏ విధంగా పరీక్షలకు తయారుకావాలో వివరంగా చెప్పాను. ప్రణాళిక ఇచ్చాను. "మీరు రెండు గంటలు చదివివానంటారు... నాలుగు గంటలు చదివానంటారు... నిజానికి మీరు అందులో సగానికి తక్కువగానే టైము చదువుకి వినియోగిస్తారు... ఏవేవో అనవసరపు ఆలోచనలు

## కవిత

# అక్షరాయుధాన్నై......,

- మెరాజ్ ఫాతిమా,
9000173860



చిక్కుముడి సమాజ సమస్యలకు,
సులువైన మార్గాన్వేషినై....
పగిలిన అద్దం ముక్కలను,
అతికించే సమైక్యతా సూత్రాన్నై...,
కీచులాటల కీచకులను ఏకం చేసే,
సామూహిక సంఘటిత శక్తినై...,
జనన, మరణ ధృవాల మధ్య,
సుఖ, దు:ఖాల అయస్కాంత ఆకర్షణనై..,
అచ్చిరాని అనుబంధ అఖాతాల మధ్య,
మానవీయ వారధినై..,
జనం గుండెల్లో జెండాగా ఎగురుతూ,
అట్టడుగు వర్గాల ఆకలి కేకనై..,
మనుషుల మధ్య విస్తరించే రాక్షస,
నిశ్శబ్దాన్ని పారద్రోలే లిపి ఘోషనై..,
సరికొత్త జీవనపేజీ కై వెతికే,
అనంతాన్వేష అవిశ్రాంత అక్షరాన్నై..,
తప్పుడు తలకట్టుల తలలు కొట్టే,
చప్పుడు చేసే (శబ్ద) యుద్ధ కవిత్వభేరి మోగిస్తున్నా...

అప్రయత్నంగా ప్రవేశించి, మిమ్మల్ని ఏకాగ్రతతతో చదవనివ్వవు... వాటిని అధిగమించాలి... ఆ పద్ధతులు చెప్తాను...” అని శాస్త్రీయమైన పద్ధతులు విడమర్చి చెప్పాను... విద్యార్థులు సంతోషించారు. ఆ విధంగా నా మిత్రుడు చైతన్య నాకూ సంతోషాన్ని పంచి, గబగబ వెళ్ళిపోయాడు.

విద్యార్థులు పెద్ద సంఖ్యలో కౌన్సెలింగ్ క్లాసుకు వచ్చారు. భావన అనే విద్యార్థిని చెప్పిన మాటలు నీకు చెప్తాను. మనిషి ఎప్పుడూ విద్యార్థిగానే వుండాలని ఎందుకంటారో మరోసారి తెలుసుకున్నాను.

“నేను కామర్స్ చదువుతూనే చార్టెర్డ్ అకౌంటెంట్ పరీక్షలకు కూడా తయారవుతున్నాను. అయిదారు సంవత్సరాలు బాగా కష్టపడితే, చార్టెర్డ్ అకౌంటెంట్ కావొచ్చు. ఎంతో, ఎన్నో నేర్చుకోవాల్సి వుంటుంది. చట్టాలు – పన్నులు – ప్రాజెక్టులు – అకౌంటెన్సీ – ఆడిటింగ్ – కాస్టింగ్ – మెనేజ్‌మెంట్ – ఆ విధంగా చాలా నేర్చుకోవాల్సి వుంటుంది. బాధ్యతాయుతమైన వృత్తి. ఉద్యోగ, వృత్తి అవకాశాలకు లోటులేదు. విశ్వసనీయత దాని ప్రాణం, ప్రమాణం కూడా. ఆ వృత్తి యిచ్చిన సర్టిఫికెట్ల ఆధారంగా కోట్లాదికోట్ల ఆర్థిక కార్యకలాపాలు జరుగుతాయి...” ఆ విధంగా చెప్పి, అందరి మొహల్లోకి చూసింది. మళ్ళీ చెప్పడం మొదలెట్టింది... ఈ వృత్తిని ఎంచుకోవడం వెనుక సామాజిక లక్ష్యం కూడా వుంది. నల్లధనం అంటే ఏమిటి? అది ఎలా ఏ విధంగా ఏ మార్గాల్లో సృష్టించబడుతుంది? అది ఆరోగ్యకరమైన ఆర్థిక వ్యవస్థను ఏ విధంగా అస్తవ్యస్తం, ఛిన్నాభిన్నం, అతలాకుతలం చేస్తుంది? నల్లధనాన్ని ఏ విధంగా తెల్లధనంగా మార్చుకుంటున్నారు? నల్లధనం సమాంతరంగా ప్రవహిస్తున్నప్పుడు, నిజమైన అభివృద్ధి ఏమి జరుగుతుందో, ఏ మేరకు జరుగుతుందో ఎలా తెలుస్తుంది. రాజ్యం నల్లధనాన్ని ఎందుకు అరికట్టదు? ఎందుకు నిర్మూలించదు? ఆ విధంగా ప్రజల్లో నల్లధనం పట్ల చైతన్యం రావాల్సి వుంది? ఆ దిశలో నేను పనిచేయలనుకుంటున్నాను” అని చెప్పింది. అందరూ ఉత్సాహంతో చప్పట్లు కొట్టారు. టైం చూసుకుని, తొందర పని వుందని చెప్పి, వెళ్ళిపోయాడు.

■■■

నా మిత్రుడు చైతన్య ఆ విధంగా వచ్చినప్పుడల్లా, విద్యార్థుల ఆలోచనా విధానంలో వస్తున్న మార్పులు గురించి చెప్తున్నాడు. ఇవాళ మరోమాట కూడా అన్నాడు. యువతరం మేధావర్గంలో ప్రజాస్వామ్య విప్లవం ప్రారంభమైంది అన్నాడు.

“మేధావర్గమే ప్రజా విప్లవాలకు రూపకల్పనచేసి, ఊపిరిపోస్తుంది... ప్రజలు నడుపుతారు... మేధావర్గం కీలకపాత్ర పోషిస్తుంది. మరో వాస్తవాన్ని కూడా చెప్పుకోక తప్పదు! దోపిడీలు చేస్తున్న మేధావర్గం దోపిడీలకు సహకరిస్తున్న మేధావర్గం – దోపిడీ వ్యవస్థను పెంచి పోషించడంలో నిర్వహిస్తున్న పాత్ర చిన్నదేమీకాదు!” అని చైతన్యతో అన్నాను. ఔను, నిజమేనని తల ఊపుతూచెప్పి, సమయపాలనకు చిరునామాగా వున్న నా మిత్రుడు చైతన్య, చకచక అడుగులువేస్తూ, గబగబ వెళ్ళిపోయాడు.

# వలసపోయిన సీమ

-ఎన్. ఈశ్వర్ రెడ్డి
9490192228

పల్లవి : రాయలేలిన సీమ
రాళ్ళపాలయ్యింది తమ్ముడా
నేడు - సీమ పేదల బతుకు
దీనంగా దిగజారె చెల్లెలా ॥రాయలేలిన॥

చరణం : ఎవడి శాపమొగాని నెర్రెలిచ్చెను భూమి
గింజ మొలకెత్తక చచ్చిపోయెను ఓర్మి
తల్లిలాంటి పల్లె వెలవెలా పోయింది
పైరు బిడ్డలులేని గొడ్రాలు అయ్యింది
పొట్ట చేతబట్టి తమ్ముడా
వలస-బాట పట్టినారు చెల్లెలా... ॥రాయలేలిన॥



చరణం : కరువు కొండచిలువ సేద్యాన్ని మింగింది
కష్టాల కొలిమిని ఇంట రగిలించింది
కూలి గింజల కొరకు కన్నతల్లిని వదలి
పిల్లపాపలతోన కదలి పోయెను పల్లె
ఏ పట్న వాకిట్లో తమ్ముడా
పల్లె - బిచ్చగత్తయ్యేనో చెల్లెలా ॥రాయలేలిన॥

చరణం : డొక్కలెండబెట్టి రూపాయి పోగేసి
కయ్యకాలువ అమ్మి వీసాకు కట్టేసి
కోటి ఆశలతోన గల్ఫ్‌లో దిగనిచ్చి
గొర్రెనమ్మినట్లు నిలబెట్టి అమ్మేస్తే
పాస్పోర్టు గుంజుకొని తమ్ముడా
సేటు-కట్టు బానిస చేసె చెల్లెలా ॥రాయలేలిన॥

చరణం : నాయకుల హామీలు నగుబాటు చేశాక
నమ్మిన పేదోళ్ళు నట్టేట మునిగాక
పథకాలు పింఛన్లు అయినోళ్ళకిచ్చాక
పుట్టిన మట్టికే కానోళ్లు అయినాక
చేసేది ఏముంది తమ్ముడా
మనసు-కాష్టమై రగిలింది చెల్లెలా ॥రాయలేలిన॥

చరణం : గంజికే గతిలేక కూలిపోయెను మనిషి
గడ్డిపోచలు లేక ఎండిపోయెను గొడ్డు
ఏలికల దయరాక తల్లడిల్లెను గడ్డ
ఏడ్చి ఏడ్చి చావు చెరలోన చిక్కాక
ఎముకల గూట్లోన తమ్ముడా
ప్రాణ-మారిపోబోతోంది చెల్లెలా ॥రాయలేలిన॥

చరణం : పంటపండక ఒకడు-చేసినప్పుతో ఒకడు
వడ్డి బరువుకు ఒకడు-పరువుకొమ్మకు ఒకడు
ఆత్మబలిదానాలు చేస్తూనే ఉన్నారు
అంతులేనియాత్ర ఎంచుకొంటున్నారు
ఏ దేవుడొచ్చేనో తమ్ముడా
సీమ-తలరాత మార్చేనో చెల్లెలా ॥రాయలేలిన॥



# సుగాలీ భాషపై ఇతర భాషల ప్రభావం



- ఇస్లావత్ భీమా నాయక్
9441986976

*ఈ తండాలలో రోజువారి వ్యవహారాలు వారి మాతృభాషయైన గొర్ బొలిలోనే మాట్లాడుకోవడం జరుగుతుంది. గొర్ అనగా సుగాలీలు, లంబాడీలు లేదా బంజారాలని. బొలి అనగా సుగాలీలు మాట్లాడే బాష అని అర్థం. వీరు మాట్లాడే భాష గొర్ బొలిపై ఇతర భాషల ప్రభావం లేకపోలేదు. అయితే **1969**వ సంవత్సరంలో "All India Banjara Study Team" తొలిసారి వీరి భాషను గొర్ బొలి వ్యవహారంలో ఉన్నదని గుర్తించారు. తమ జాతి కానివారిని కోర్ (బంజారాల కాని వారిని) అని పిలుస్తారని కూడా బంజారా స్టడీ టీమ్ గుర్తించింది. పూర్వం భౌగోళికంగా ఏకాంత జీవితం గడిపిన సుగాలీలపై వారి పరిసరాల్లో నివసించే తెలుగు ప్రజల ప్రభావం పడడంతో తెలుగు భాషా పదాలు సుగాలీ భాషలో ప్రవేశించాయి.*

ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న 35 గిరిజన తెగలలో బంజారా, లంబాడీ లేదా సుగాలీలు ఒకరు. ఒక్కొక్క ప్రాంతంలో వీరిని ఒక్కొక్క పేరుతో పిలుస్తున్నారు. రాయలసీమలో సుగాలీలని, కోస్తా ప్రాంతాల్లో లంబాడీలని, తెలంగాణ రాష్ట్రంలో బంజారాలని పిలువబడుతున్నారు. వీరి ఆచార వ్యవహారాలు, సంస్కృతి సంప్రదాయాలు, నమ్మకాలు మరియు పుట్టుక నుండి గిట్టే వరకు మిగత గిరిజన తెగలతో పోలిస్తే ప్రత్యేకతను కలిగి వున్న తెగ సుగాలీ, లంబాడీ లేదా బంజారాలుగా చెప్పవచ్చును.

బంజారాలు, లంబాడీ లేదా సుగాలీలను సమాజంలో పర్యాయ పదాలుగా పిలుస్తున్నప్పటికీ వీరి పుట్టుక ఉత్తర భారతదేశంలోని రాజస్థాన్‌లోని మేవాడ్ నుండి ప్రారంభమై వ్యాపార వాణిజ్యం నిమిత్తం దక్షిణ భారతదేశానికి వచ్చి స్థిరపడ్డారని అనేక పరిశోధన వలన తెలుస్తుంది. సుగాలీలు నివాసం ఉండే ప్రాంతాలను తండాలని పిలుస్తారు. ఈ తండాలలో రోజువారి వ్యవహారాలు వారి మాతృభాషయైన గొర్ బొలిలోనే మాట్లాడుకోవడం జరుగుతుంది. గొర్ అనగా సుగాలీలు, లంబాడీలు లేదా బంజారాలని. బొలి అనగా సుగాలీలు మాట్లాడే బాష అని అర్థం. వీరు మాట్లాడే భాష గొర్ బొలిపై ఇతర భాషల ప్రభావం లేకపోలేదు. అయితే 1969వ సంవత్సరంలో "All India Banjara Study Team" తొలిసారి వీరి భాషను గొర్ బొలి వ్యవహారంలో ఉన్నదని గుర్తించారు. తమ జాతి కానివారిని కోర్ (బంజారాల కాని వారిని) అని పిలుస్తారని కూడా బంజారా స్టడీ టీమ్ గుర్తించింది. పూర్వం భౌగోళికంగా ఏకాంత జీవితం గడిపిన సుగాలీలపై వారి పరిసరాల్లో నివసించే తెలుగు ప్రజల

ప్రభావం పడడంతో తెలుగు భాషా పదాలు సుగాలీ భాషలో ప్రవేశించాయి. సామాన్య వ్యవహారంలో ప్రాచుర్యం పొందిన పదాలు, ఆచార వ్యవహారాలకు సంబంధించిన పదాలు, ప్రభుత్వ పరిపాలన రంగానికి చెందిన పదాలు తదితర రంగాలకు చెందిన పారిభాషిక పదాలు అధికంగా చేరాయి. సుగాలీలు, లంబాడీలు లేదా బంజారాలు మాట్లాడే భాషలో కొంతవరకు మిశ్రభాష శైలిని వాడుతున్నట్లు కనిపిస్తుంది.

**తెలుగు ప్రజలు వాడే వస్తువుల పేర్లు కాని, ఇతరముల పేర్లు కాని సుగాలీలు తమలో తమే మాట్లాడుకొంటున్నప్పుడు అనుకోకుండా తెలుగులో వున్న పేర్లనే వాడుతున్నారు. సుగాలీ భాషలో ఆ పదాలకు పేర్లు లేకపోవడం కూడా ఒక కారణం కావచ్చు.**

ఆంగ్లంలోని 'Influence' అనే పదానికి సమానార్థకంగా మనం తెలుగులో ప్రభావం అనే పేరును వ్యవహరిస్తున్నాం. 'Influence' అంటే పలుకుబడి, ప్రాబల్యం, మాట, చెల్లుబడి అనే అర్థాలు స్ఫురిస్తున్నాయి. పై విషయాల ఆధారంగా సుగాలీలపై ప్రభావం అనేది ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సంబంధాలు కలిగి ఉండటం వలన కనిపిస్తుంది. ఇందులోని వాక్యాలు, పదాలు అన్నీ ప్రభావ పరంగా వర్తిస్తాయి. వీరిపై ప్రభావం వీరికి తెలియకుండానే ఇన్ని రకాల అర్థాలలో వ్యవహృతమవుతోంది. ప్రభావం అనేది ఆర్థికంగా, రాజకీయంగా సాంస్కృతికంగా అభివృద్ధి చెందిన వారి భాషల సాహిత్య ప్రభావం అంతగా అభివృద్ధి చెందని వారి భాష సాహిత్యాల మీద చారిత్రకంగా కనిపిస్తుంది. అదేవిధంగా అభివృద్ధిచెందని వారి ప్రభావం అభివృద్ధి చెందిన వారిపై పడుతుంది. ఆధునిక యుగంలో ఈ ప్రభావాలను అనుకరించే స్వభావమూ, సృజనాత్మక శక్తి, రచనా సామర్థ్యం వంటి వాటిని బట్టి ప్రభావాలు వేరువేరుగా ఉంటాయి. ప్రభావం ఒకరిమీదగాక అనేకమంది మీద ఉండవచ్చు. సాహిత్య సృష్టి చేయడానికి, ప్రతిభను వ్యక్తం చేయడానికి ప్రభావం దోహదం చేస్తుంది. ఏ సాహిత్యం వల్ల ప్రభావితం అవుతారో ఆ సాహిత్యంతో ఉన్న పరిచయ విస్తృతిని బట్టి ప్రభావ స్థాయి నిర్ణయింపబడుతుంది. సాహిత్య ప్రభావం వల్ల భాషలో, శైలిలో, ప్రక్రియలో మార్పులు వస్తాయి.

ఒక భాషపై ఇతర భాషలపై ప్రభావం అనేది ప్రపంచంలో ఏ జాతికిగాని, ఏ ప్రదేశంగాని, ఏ సాహిత్యం గాని, ఇతర జాతుల, దేశాల, సాహిత్యాల నీడలు సోకకుండా ఉన్నదని నమ్ముట కష్టం. ఇతర సాహిత్య ప్రభావం లేకుండా తన కాళ్లమీద మాత్రమే నిలిచిన సాహిత్యం లేదనవచ్చు. భారతదేశంలో సంస్కృత, ప్రాకృత సాహిత్యాల ప్రభావం సోకని సాహిత్యమే లేదు. తెలుగు సాహిత్యం నూటికి తొంబై పాళ్ళు సంస్కృత సాహిత్యాన్ని అనుసరించింది. అదేవిధంగా ఈ భాషల వెనుక తెలుగు సాహిత్యాలపై ముఖ్యంగా భాషపై విశేష ప్రభావం చూపినవి. అవి పార్సీ, అరబ్బీ, ఉర్దూ భాషలు. ఈ భాషల్లోని ఎన్నో వందల పదాలు తెలుగు భాషలోనికి వచ్చినవి. ఈ పదాలకు బదులుగా వాడుటకు కొన్నింటిని తెలుగు పదాలు లేకుండా పోవునంతగా ఆ పదజాలము యొక్క ప్రభావము తెలుగు భాషకు సోకింది.

పై పేర్కొన్న విషయం ఆధారంగా సుగాలీ భాష మౌఖిక సాహిత్యపరంగా ఆలోచిస్తే సుగాలీలు శతాబ్దాల నుండి తెలుగు వారితో సాంఘికపరమైన సంబంధాలు కలిగి వున్నారు. తెలుగు ప్రజలు వాడే వస్తువుల పేర్లు కాని, ఇతరముల పేర్లు కాని సుగాలీలు తమలో తమే మాట్లాడుకొంటున్నప్పుడు అనుకోకుండా తెలుగులో వున్న పేర్లనే వాడుతున్నారు. సుగాలీ భాషలో ఆ పదాలకు పేర్లు లేకపోవడం కూడా ఒక కారణం కావచ్చు. ఏ సాహిత్యాన్ని పరిశీలించాలన్నా ఇతర సాహిత్యాలను వాటిలో వాటికి గల సంబంధాన్ని చూడవలసి వుంటుంది. ఒక సాహిత్యం మీద ఇంకొక సాహిత్య ప్రభావం ముఖ్యంగా రెండు విధాలుగా పడుతుంది. ఒక సాహిత్యం యొక్క ప్రభావం ఇతర సాహిత్యముల ద్వారా ఇంకొక సాహిత్యమునకు సోకుట మొదటిది. ఒక సాహిత్యం పఠనం వలన గాని, దాని సంపర్కం వలన గాని నూతన భావాలు ప్రబలి, హృదయమునకు, మనస్సునకు ఉన్న సంప్రదాయ శృంఖలములు తెగుట ద్వారా మన ప్రభావం పడుట రెండొవది. ఈ రెండు ప్రభావాలు సోకని సాహిత్యమంటూ ప్రపంచంలో ఏ భాషలోను లేదు. అట్లే సుగాలీలకు తెలుగు ప్రజలతో భౌగోళికంగా ప్రత్యక్ష, పరోక్షంగాను సంబంధాలు ఉన్నాయని చెప్పవచ్చు. సుగాలీ సంస్కృతీ మీద, సుగాలీ ప్రజల మీద, సుగాలీ భాష, మౌఖిక సాహిత్యం మీదను అదేవిధంగా సుగాలీలకు విద్యావకాశాలు, వారికి సంబంధించిన అన్ని విషయాలు ప్రభుత్వ, ప్రైవేటు స్వచ్ఛంద సంస్థల వారు తెలుగు భాషలో వివరిస్తున్నారు.. కనుక తెలుగు వారి భాష, సంస్కృతి ప్రభావం పరోక్షంగా కంటే ఎక్కువగా ప్రత్యక్షంగా కనిపిస్తుంది.

**సుగాలీ భాషలోనికి వచ్చిన తెలుగు భాషా పదాలు :** అప్పు, ఆసుపత్రి, ఇటుక, ఇసుక, కత్తెర, కాగితం, కాలువ, కిటికీ, కుప్ప, కుర్చీ, గడ్డం, గాలిపటం, గుడి, గుడిసె, గోలి, గోడ, చందమామ, ఛాతి, జనం, జాగ్రత్త, జిల్లా, టమాట, డబ్బు, తలుపు, తోట, దేవుడు, దోసకాయ, ద్రాక్ష, నయం, నిచ్చెన, పంట, పరీక్ష, పలక, పుల్ల, పుస్తకం, పూర్తిగా, పొట్టు, పోటి,

ప్రయాణం, ఫొటో, బండి, బలపం, బుగ్గ, బురద, బొట్టు, బోడగుండు, భద్రం, మంచు, మండలం, మంత్రి, మడి, మామ, మాయం, మిద్దె, ముగ్గు, మేస్త్రీ, రంగు, రథం, రాజు, వడ్డీ, వారం, విషయం, సంఘాలు, సంసారం, సన్యాసి, సపోటా, సబ్బు, సిగ్గు, సిపాయి, సున్న మొదలైన పదాలు.

**సుగాలి భాషలోనికి వచ్చిన ఆంగ్ల భాషా పదాలు :** ఆటో, ఆపిల్, ఆఫీసు, ఇడ్లీ, ఇన్స్పెక్టర్, కండక్టర్, కలెక్టర్, కానిస్టేబుల్, కారు, కూలర్, కూలీ, కోటు, గ్లాసు, జీపు, టికెట్, టిన్ను, టివి, టైర్, ట్రాక్టర్, డాక్టర్, డ్యూటి, నంబరు, నర్సు, పేపర్, పోలీసు, పోస్టు, పోస్టుమాన్, ఫొటోగ్రాఫ్, పోస్టాఫీసు, ఫ్యాన్, ఫ్రిజ్, బక్కెట్, బడ్జట్, బస్సు, బిల్, బిస్కెట్, బైక్, బ్యాంక్, రికార్డు, రిక్షా, రిజిష్టరు, రిమోట్, రూమ్, రెవెన్యూ, రేడియో, రోడ్డు, లాంతరు, లారీ, లైట్, వాచీ, షాపు, సార్, సిలిండర్, సైకిల్, స్కూటర్, స్కూలు, స్టాండ్, స్టాంపు, స్టేషను, స్టౌవ్, హెడ్డు, హోటల్ మొదలైన పదాలు.

> ***ఇప్పటికీ ఇళ్ళలోను, బంధువులతోను వారి స్వంత మాండలికం అయిన గొర్ బొలిలోనే మాట్లాడుతారు. ఇతరులతో సంభాషించేటప్పుడు వారికి తెలియకుండానే వాటిలో తెలుగు పదాలు మరియు ఆంగ్ల పదాలు ప్రవేశిస్తాయి.***

**సుగాలీ భాషలోనికి వచ్చిన అన్య భాషా పదాలు :** ఏ భాషలోనైనా పదాలు దేశ్యాలు, అన్య దేశాలు అని రెండు విధములు. మూల భాష నుండి వచ్చిన పదాలు దేశ్యాలు, ఇతర భాషల నుండి వచ్చి చేరినవి అన్య దేశాలు. సాధారణంగా ఒక భాషలోనికి సమీపవర్తి భాషల నుంచి గానీ, సాంఘిక, రాజకీయ మత సాంస్కృతిక వాణిజ్య సంబంధాల వల్ల దూరవర్తి భాషల నుంచి గాని పదజాలం వచ్చి చేరుతుంది. ఏదైనా ఒక భావాన్ని సూచించడానికి పదం స్వభాషలో లేనప్పుడు అన్యషల నుండి ఆ పదాన్ని గ్రహించడం జరుగుతుంది. అలా గ్రహించినవి సుగాలీ భాషలో ప్రత్యక్షంగా వచ్చి చేరినవి కావని ఊహించవచ్చు. ఎందుకంటే వీరికి ఆ భాషతో ప్రత్యక్ష సంబంధం లేదు. పరోక్ష సంబంధమే ఉంది. అన్య భాషా పదాలు తెలుగులో ప్రవేశించి వారి నుండి సుగాలీ భాషలోనికి వచ్చి చేరినవని చెప్పవచ్చు. సుగాలీ భాషలో వచ్చి చేరినవి అన్య భాషా పదాలు అరబీ, ఉర్దూ. పర్షియను, కన్నడం, తమిళం, పోర్చుగ్రీసు, ఫ్రెంచి బాషా పదాలు మొదలైనవి.

**అరబీ, పర్షియను, ఉర్దూ భాషా పదాలు :-** సిస్తు, దస్తు, కచేరి, దస్తావేజు, వకీలు, అదాలత్, గుమస్తా, ఖైదు, జమేదారు, అమలు, ఖైది, నిత్య వ్యవహారంలోని పదాలు మేజా, పాయఖానా, తపేలా, కూజా, చాకు మొదలైన పదాలు.

**కన్నడ భాషా పదాలు :-** నంగానాచి, పల్లె, బిడారు, రాయరు, సాకు మొదలైన పదాలు

**తమిళ భాషా పదాలు :-** అలిమేలు మంగ, వడ, సాంబారు మొదలైన పదాలు

**పోర్చుగ్రీసు భాషా పదాలు :-** అలమారు, కమీజు మొదలైన పదాలు

**ఫ్రెంచి భాషా పదాలు :-** ఫిరంగీ, కమాను మొదలైన పదాలు. పై భాషలోని పదాలను సుగాలీల వారు సమయ సందర్భం వచ్చినపుడు ఉపయోగించుకోవడం జరుగుతుంది.

ప్రస్తుత సమాజంలో సుగాలీలు విద్యావంతులూ, విద్య లేని వారు తెలుగు మరియు ఆంగ్ల పదాలు చేర్చి మాట్లాడుతున్నారు. వ్యక్తులు బహు భాషా వ్యవహర్తలైనప్పుడు ఒక్కొక్క భాషను ఉపయోగించే సందర్భాలు వేరువేరుగా ఉంటాయి. బంజారాలు, లంబాడీలు లేదా సుగాలీలు చాలా తరాల కిందట ఆంధ్రప్రదేశ్‌కు వలస వచ్చి స్థిరపడ్డారు. వారు ఇప్పటికీ ఇళ్ళలోను, బంధువులతోను వారి స్వంత మాండలికం అయిన గొర్ బొలిలోనే మాట్లాడుతారు. ఇతరులతో సంభాషించేటప్పుడు వారికి తెలియకుండానే వాటిలో తెలుగు పదాలు మరియు ఆంగ్ల పదాలు ప్రవేశిస్తాయి. వీరికి తెలుగు భాషలో విద్యాబోధన జరుగుతుంది. అదేవిధంగా గొర్ బొలి భాషకు లిపి లేకపోవడం, విద్యాబోధన గొర్ బొలిలో జరగకపోవడం వలన గొర్ బొలి భాష క్రమంగా కనుమరుగవుతుంది.

ఆంధ్రప్రదేశ్ కేంద్రంగా తీసుకొని పరిశీలిస్తే ఇక్కడ మాట్లాడే భాషలు తెలుగు, ఉర్దూ, హిందీ, ఆంగ్లం, మరియు ఆటవిక భాషలు, ఆటవిక భాష అయిన గొర్ బొలి ఈనాడు తెలుగు ఉర్దూ, హిందీ, ఆంగ్లం పదాలను కలిపి సందర్భానుసారంగా మాట్లాడుతున్నారు. ఆంధ్రప్రదేశ్‌లోని సరిహద్దు జిల్లాలైన చిత్తూరు జిల్లాలోని తమిళ భాష పదాలు అనంతపురం జిల్లాలోని కన్నడ భాషా పదాలు మరియు కడప జిల్లాలోని కొన్ని సరిహద్దులో ఉండే ప్రాంతాలలో తమిళ భాష పదాలను మాట్లాడుతున్నారు. అలాగే తెలంగాణ రాష్ట్రంలోని ఆదిలాబాద్ జిల్లాలోని లంబాడీలపై ఒరియా భాష ప్రభావం మరియు అక్కడ అక్కడ మరాఠి భాష ప్రభావం కూడ కనిపిస్తుంది. ఇన్ని విధాల ప్రభావం ఉన్నప్పటికీ సుగాలీలు, లంబాడీలు లేదా బంజరాలు తమ లిపియైన గొర్ బొలి భాష మౌఖికపరంగా వారి జన వ్యవహారంలో మాత్రం ఇంకా మిగిలే ఉందని చెప్పవచ్చు. సుగాలీ భాష నేటికీ మౌఖిక రూపంలో ఉండి, భాషలోని కొన్ని పదాల వాడుక తగ్గిపోయి మరికొన్ని పదాలు ఉనికి

## కవిత

# చేతులే ఆయుధాలు

అమరజ్యోతి
9392383718



ఉప్పెనలెప్పుడూ చెప్పకుండానే వస్తాయి
తుఫానులుకూడా... హుద్ హుద్ లై.. లైలాలై...
సముద్రాలతో మనుషులపై నిర్దాక్షిణ్యంగా దాడిచేస్తాయి
అని వార్యతల్లో చిక్కుకుని ధ్వంసంచబడ్తున్నప్పుడే
విభజనలూ.. చీల్చడాలూ... జీవితాలనూ.... సంపదలనూ.... కన్నీళ్ళనూ
పంచుకోవడాలూ
అన్నీ ఒక్కోసారి చాలా అకస్మాత్తుగా మరో యుద్ధంవలె
ఆకాశమే తలపైకూలిపోతుంది
కాని
మనిషి.. ఎదుర్కుంటాడు... అదుమబడ్తున్న స్ప్రింగ్ ఎదురుతన్ని
గాలిలోకెగిరినట్టు
మనిషి ఒక "ఉగాది" ని అనుభూతిస్తూ
తుఫానువలెనే చెప్పాకుండా చెట్టుకొమ్మల్లోకి ప్రవేశించిన
వసంతంలా
నరాల నదుల్లోకి విద్యుత్తై ప్రవేశించిన నవచేతనను స్పృహిస్తూ
కొత్తగా మళ్ళీ జీవితంతో యుద్దానికుపక్రమిస్తాడు-
చిగుళ్లకు పుట్టకముందు ఏ ఆనవాళ్ళూ ఉండవు
పొటమరింపుతోనే... మొదలు...
ఉనికి.. ఎదుగుదల... విస్తరణ.. వ్యాప్తి
పచ్చని ఆకులను తొడుక్కుని చెట్టు చెట్టంతా జీవకాంతి
ఒక్కోసారి చిరునామా ఉండదు.. ఇల్లుండదు...
ముందు దారుండదు
గమ్యంకూడా స్పృహించదు
కాని పాదాలు శరీరాన్నీ... మనిషినీ... లక్ష్యాలనూ మోసుకుంటూ
నడకను కొనసాగిస్తూనే ఉంటాయి
నడక ఆగదు... పయనమాగదు... అంతిమంగా యాత్ర ఆగదు
కాలానికి మనం పెట్టిన పేరు జయ ఐనా.. మన్మథ
ఐనా... దుర్ముఖి ఐనా
పతి ఉగాదీ చెబుతున్న పాఠం ఒకటే
వసంతం వెంట ఒక శిశిరం... ఒక గ్రీష్మం... ఒక హేమంతం.,
మళ్ళీ ఒక వసంతం.. ఒక నిరంతర చక్ర భ్రమణం
పడిలేవడం... మళ్ళీపడి... మళ్ళీలేచి
జీవితమెప్పుడూ.. పడిలేచే కెరటమే
నిన్నటి మోడు... నేడు చిగురిస్తున్న కొమ్మ
నేటి అస్తమయం రేపటి ఉదయించబోయే ఉదయం
ఇప్పటి ఈ ఖాళీ చేతులే రేపటి తరాన్ని నిర్మించే ఆయుధాలు-

---

ప్రశ్నార్థకంగా మారిపోయాయి. ప్రపంచీకరణ నేపథ్యంలో భాష తన ఉనికిని కాపాడుకుంటూ, స్వల్ప మార్పులకు చోటు కల్పిస్తూ, నేటి సుగాలీల జీవనంలో కొనసాగుతూ ముందుకు వెళ్తుంది. భాష మౌఖిక రూపంలో ఒకరి నుండి మరోకరికి ప్రసారమవుతూ వుంటుంది. అయితే ఈ విధంగా ప్రసారమవుతున్న భాషకు లిపి హృదయం వంటిది. అయితే సుగాలీలకు లిపి లేనందున చాలా పదాల యొక్క నిజ అర్థం కోల్పోయే ప్రమాదం పొంచి వున్నది. బంజారాలు నేటికి వారి తండాలలో గొర్ బొలిలోనే మాట్లాడుకోవడం ఒక శుభపరిణామం. ప్రపంచీకరణ, సరళీకరణ మరియు ప్రవేటీకరణ విధానాలు నేటి సమాజంలో ప్రధానపాత్ర పోషిస్తున్నాయి. అందువలన సుగాలీలు ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి విద్య, ఉద్యోగ, వ్యాపార సంబంధమైన విషయాలపై వేర్వేరు ప్రాంతాలకు వలస వెళ్ళినప్పుడు ఆ ప్రాంత భాషలోని పదాలను ఉపయోగించడం గమనించవచ్చు.

అభివృద్ధి చెందిన కులాలు, జాతులు మరీ పోటీపడి ముందుకు సాగిపోతుంటే అభివృద్ధి చెందని సుగాలీ, లంబాడీలు లేదా బంజారాలు మాత్రం వెనుకబడిపోతున్నారు. దీనికంతటికి కారణం విద్య. విద్య అనేది మాతృభాష నుండి నేర్పించవలసి ఉంది. కాని సుగాలీలకు మాతృభాష ఒకటి ఉంటే, విద్య నేర్చుకొనే భాష మరొకటి ఉన్నది. అందువలన వాళ్లు కావలసినంత అభివృద్ధి చెందలేకపోతున్నారు. అయితే వీరిలో ఎన్నో మార్పులు జరుగుతున్న, వారి భాషను స్వల్ప మార్పులతో మాట్లాడుతూ నేటికి భాష సజీవంగానే ఉంచుతూ విద్య, ఉద్యోగ, వ్యాపార సంబంధీ విషయాలకై సుదూర ప్రాంతాలకు వెళ్ళినా వారి మాతృభాషపైనే ఎక్కువగా ప్రేమాభిమానాలు కలిగి వారి భాష ఉనికిని ఇప్పటికీ కాపాడుకుంటున్నారు.

-సిరికి స్వామి నాయుడు
9494010330

# సంత



నాలుగ్గోడలూ, నాలుగ్గదులూ కాదు.......ఇల్లంటే
కొన్ని ఆశలూ ఆత్మీయతలూ
మరికొన్ని ప్రేమలూ బంధాలూ కలగలసిన మమతల కోవెల
పూరిల్లో, మిద్దిల్లో, పెంకుటిల్లో మేడల్లో.....ఏదైతేనేం
అంతటి కుటుంబాన్నీ తన రెక్కల్లో పొదుముకున్న పర్ణశాల
అలసివచ్చినవేళ తన ఒడిలో సేదదీర్చే చల్లని తల్లిఒడి
కష్టాలూ కన్నీళ్లూ కోపాలూ తాపాలూ అలకలూ బుజ్జగింపులూ
సరదాలూ సందళ్లూ ఒకటేమిటి ఆరారు రుతువులూ వచ్చిపోయే
కూడలి
వేకువ కేరింతలూ, వెన్నెల ముచ్చట్లూ నవ్వుల జలపాతాలూ
నట్టింట పంటకాల్వలా గజ్జెలసవ్వళ్లూ కలబోసుకొని
తరం నుండి తరానికి తరగలెత్తి పారే జీవనది.
పండగలూ పున్నాలూ పెళ్ళిళ్లూ పేరంటాళ్లూ కథలూ కార్యాలూ
సంబరంగా జరుపుకునే పవిత్ర వేదిక
పక్షుల కిలకిలలు పచ్చనితోట తరాల ఆచారాల
సాంప్రదాయాల ఆటపట్టు
సమాజానికి కావాల్సిన మనిషిని తయారుజేసి పంపే
కర్మాగారం.
యిపుడీ పచ్చని యింటిమీద పాపిష్టికన్ను పడింది.
యింటిముందు ముగ్గుల్ని చెరిపేసి,
వాడెవడో....ఇంటిదువ్వారానికి కట్టుకున్న
మమకారాల మావిడాకుల తోరణాలూ తెంపేసి ఇంటినో
కార్యాలయం చేసేడు
ఇంట్లో సాలెగూడు పెట్టీ, చిక్కుకున్న పురుగు జవజీవాల్ని
పీల్చేస్తాడు.
కలలప్రపంచం కళ్లముందు నిలిపి మనిషినో యంత్రం జేస్తాడు
ఇంటి వద్దే ఉద్యోగమంటాడే గానీ
కంప్యూటర్లూ, మానిటర్లూ అప్లికేషన్లూ, ప్రాజెక్టు మధ్య
సనాతనమైన 'ఇల్లు' అనే భావనను కొల్లగొట్టుకుపోతాడు
యింట్లో ప్రేమల్నీ పాశాల్నీ మమతల్నీ మమకారాల్నీ ఆశల్నీ
అనుబంధాల్నీ
సరదాల్నీ సందళ్లనీ అలకల్నీ, ఆత్మీయ పలకరింపుల్నీ అన్నీ
దొంగలించుకుపోతాడు
ఇల్లు....యిపుడో ఇంకిపోయిన జీవనది, నిశ్శబ్ద ఎడారి,
పాటను కోల్పోయిన కోయిల



-మండవ. సుబ్బారావు
9493335150

# రేపటిపౌరులు



వాళ్ళు బాల్యాన్ని
ఎప్పుడో మరచి పోయారు
వాళ్ళ పసిప్రాయం
తుమ్మెదలు పువ్వుల్లో మకరందాన్ని
ఎందుకు గ్రోలుతాయో తెలీదు
తామర పువ్వులు
నవ్వులెందుకు చిందిస్తాయో తెలీదు
సెలయేరెందుకు గలగలా పారుతుంది
కోయిల కుహూ కుహూ రాగాలు
చిరుగాలి గుస గుసల మర్మాలు
తెలీయని పసి పాపలు పాపం
చిర్ర గోనె, కోతికొమ్మచ్చి
చెడుగుడులు, చెర్రాటలు
వారి చరిత్ర పుస్తకాల్లో నిదుర పోతున్నాయి
మార్కుల కోసం
ర్యాంకుల కార్ఖానాలో
నిత్యం చిత్రిక పట్టుకుంటున్నారు



# 'మాయాబిళ రహస్య' ఛేదన

-డా॥ ఎ. రవీంద్ర బాబు
9394489263

***రచయిత మ్యాజిక్ రియలిజం కథనాన్ని ఎంచుకున్నప్పటికీ వస్తువును పాఠకునికి సులభంగానే చేరువ చేశారు. పురా గాథలు, జానపద గాథలను ప్రస్తుత పరిస్థితులకు అన్వయించి కథను నడపడమే మ్యాజిక్ రియలిజం అని స్థూలంగా చెప్పొచ్చు. దాన్ని కథలో రచయిత సంపూర్ణంగా సాధించారు. సెజ్‌ల వల్ల భూమిని కోల్పోతున్న బాధితుల గురించి రాసిందీ కథ. అయితే రచయిత మ్యాజిక్ రియలిజం శిల్పంతో చెప్పిన విధానం గొప్పది.***

పాపినేని శివశంకర్... కవి, కథకులు, విమర్శకులు, పరిశోధకులు. వారు రాసిన కథే మాయాబిళ రహస్యం. ఈ కథ గురించి కొన్ని సంగతులు... చాలా మందికి తెలిసినవే... అయినా...

రాజ్యంలో భూములు రాజుకు, ప్రధాన మంత్రికి తెలిసే మాయమవుతుంటాయి... వాళ్లే మహామాయావితో కుమ్మక్కై ఈ దారుణాన్ని చేస్తుంటారు. ఆ భూముల్నించి పేదలు వలసలు పోతుంటారు. సహాయ మంత్రి కుమారశేనుడు దీని గురించి ఆలోచన చేసి మొదట మాంత్రికుడు సింగప్పతో ఆ భూమాయావిని పట్టుకునే ప్రయత్నం చేస్తాడు. కానీ సింగప్పనే ఆ మాయావి సీసాలో బంధిస్తాడు. కుమారశేనుడు స్వయంగా వెళ్లి ఆ మాయావిని బంధించి తెచ్చి రాజుగారి ముందు హాజరు పరుస్తాడు. కాని రాజు అతను చేసేది మంచిపని అని విందు భోజనాలతో సత్కరిస్తాడు. ప్రజల బాధలను స్వయంగా చూసిన కుమారశేనుడు చివరకు వాళ్లతో కలసిపోరాడటానికి సిద్ధమౌతాడు. స్థూలంగా కథలోని వస్తువు ఇది.

రచయిత మ్యాజిక్ రియలిజం కథనాన్ని ఎంచుకున్నప్పటికీ వస్తువును పాఠకునికి సులభంగానే చేరువ చేశారు. పురా గాథలు, జానపద గాథలను ప్రస్తుత పరిస్థితులకు అన్వయించి కథను నడపడమే మ్యాజిక్ రియలిజం అని స్థూలంగా చెప్పొచ్చు. దాన్ని కథలో రచయిత సంపూర్ణంగా సాధించారు. సెజ్‌ల వల్ల భూమిని కోల్పోతున్న బాధితుల గురించి రాసిందీ కథ. అయితే రచయిత మ్యాజిక్ రియలిజం శిల్పంతో చెప్పిన విధానం గొప్పది. ఆ శిల్పాన్ని, వస్తువును, వాటి సంబంధాన్ని పరిశీలించడమే ఈ వ్యాసంలో గమనించవచ్చు. 'ఉన్నట్టుండి భూములు మాయం గావటమేమిటి? బొత్తిగా అర్థం లేని మాట' విసుక్కున్నాడు కుర్రమంత్రి కుమార సేనుడు' అని కథను ప్రారంభిస్తారు శివశంకర్. అందువల్ల చాలా కథల్లాగే ఈ కథలో కూడా వస్తువు భూమి గురించే అని ఎత్తుగడలోనే తెలుస్తుంది. అట్లానే

ఎలా మాయం అవుతున్నాయన్న సందేహం మనసుల్లోకి సూటిగా వెళ్తుంది. కథాశిల్పంలో ఇదో మంచి ఎత్తుగడ..... ఇది పాఠకుల్లో కథపట్ల ఆసక్తిని కలిగిస్తుంది.

'రాత్రి రెండో జాము.. కాగడాల వెలుతుర్లో కుమారసేనుడు వేగుల వాళ్లతో మాట్లాడుతున్నాడు' అనే ఈ వాక్యాలు ప్రారంభంలో ఉండటం వల్ల చీకట్లో చిరుదివ్వెలాగా కథా గమనాన్ని ముందే సూచించడం జరిగింది. 'కాగాడా వెలుగు' పదబంధం కథా ముగింపును తెలపడాన్ని గమనించవచ్చు. ఇదీ ఓ రకమైన టెక్నిక్కే... ప్రాచీన కావ్యాలలో ఇలాంటివి చాలా చూస్తాం. ఉదాహరణకు భారతంలో శకుంతల దుష్యంతుల కథా వర్ణనలు.

ఇక మాయా మాంత్రికుడు సింగప్ప విషయానికి వస్తే... భూకేటాయింపుల మీద ప్రభుత్వం వేసిన కమిటీ గుర్తుకు వస్తుంది. మాంత్రికుడు చేసే పూజావిధానం, మంత్రాలు.. అన్నీ మ్యాజిక్ రియలిజంలో భాగమే.

కథలో భూ ప్రస్తావనలో మొత్తం 'రాజ్యంలో నూటయాభై మండలాలున్నాయి. వాటిల్లో 32 మండలాల లెక్కలు తారుమారు ఉన్నట్లు కుమారసేనుడు గుర్తిస్తాడు.' కానీ లెక్కల ప్రకారం మన రాష్ట్రంలో 109 సెజ్‌లుండగా.... పనిని ప్రారంభించినవి 36 మాత్రమే! ఇక కథలో మాయమైన భూమి గురించి చెప్తూ... 'కనీసపు తేడా 500 ఎకరాలు కాగా గరిష్ఠ భేదం 5000 ఏకరాలుంది' అంటాడు. నిజానికి రాష్ట్ర ప్రభుత్వం 50 వేల ఎకరాలకు పైగానే సెజ్‌లకు అప్పగించింది. బహుశా రచయిత ఈ లెక్కల్ని కచ్చితంగా ఇవ్వకపోవడానికి కారణం.. సాహిత్యం ఎప్పుడూ వాస్తవ ప్రపంచానికి కాల్పనికి స్వరూపమే. దీని గురించి రచయితకు తెలీదని అనుకోను. ఎందుకంటే ఆయన సిద్ధాంత గ్రంథంలో ఎక్కువ భాగం ఈ చర్చే.

రెండో భాగం మొదట కుమారసేనుడు 'ఇంత వింత మరియు విశేషం మరియు విచిత్రం మరియు విపరీతం నా ఇరవై తొమ్మిదేళ్ల జీవితంలో చూడలేదు. మహామంత్రీ!' అంటాడు ఈ మరియు పదం అన్ని సార్లు పునరావృతం చేయటం వెనుక ఓ వైపు ఇరవై తొమ్మిదేళ్ల కుమారసేనుడి ఆవేశాన్ని చెప్తే...' ఇందులో మరీ అంత 'వింతమరియు' ఏముంది లేవయ్యా....' అన్న మంత్రి మాటల్లో ఇలాంటివి సహజమనే కాదు, భవిష్యత్‌లో మరికొన్ని జరుగుతాయి అన్న సూచన ఉంది. అతని వయసును, అనుభవరాహిత్యాన్ని ఎత్తిచూపడంలో మంత్రి ఎగతాలి చెయ్యడమూ ఉంది. అంతే కాదు మన రాష్ట్ర భవిష్యత్ చిత్రమూ దాగి ఉంది. ఇంకా 'భౌతిక పరిణామాల వెనుక భౌతిక కారణాలే ఉంటాయి గదా!' అనే కుమారసేనుడి మాటలో రచయిత వాస్తవికతను అర్థం చేసుకున్న విధానాన్ని చారిత్రక భౌతికవాద దృక్కోణంతో చూడాలి. కుమారసేనుడి ఉత్సాహాన్ని గమనించిన అంధకరాజు నవ్వు, 'అసలు సంగతులేవీ అతనితో ముచ్చటించలేదు కదా!. 'వాళ్లకవి, మనకివి' అని మహామంత్రి అనడం వెనుక రాజు మంత్రి, శత్రువులతో కలిసి ప్రజల భూముల్ని దోచుకోడానికి పన్నిన కుట్రగా భూములు మాయమవటాన్ని కథలో అర్థం చేసుకోవచ్చు. మనదేశంలో 2005లో 'సెజ్' పేరిట చట్టం అమల్లోకి వచ్చింది. ఒకవైపు ప్రభుత్వం, ఇంకోవైపు కంపెనీలు.. ప్రజల భూముల్ని దోచుకునే చట్టం ఇది. గతించిన ముఖ్యమంత్రి రాజశేఖర్ రెడ్డి హాయాంలో జరిగిన భూపందేర తంతును కళ్లముందు నిలుపుతాయి పై వాక్యాలు.

ఇక మాయా మాంత్రికుడు సింగప్ప విషయానికి వస్తే... భూకేటాయింపుల మీద ప్రభుత్వం వేసిన కమిటీ గుర్తుకు వస్తుంది. మాంత్రికుడు చేసే పూజావిధానం, మంత్రాలు.. అన్నీ మ్యాజిక్ రియలిజంలో భాగమే. కానీ చివరకు మాయా మాంత్రికుడి ఎదుట ప్రత్యక్షమైన మహాకాయుడు సింగప్పనే సీసాలో బంధించడం వెనుక భూకేటాయింపుల కమిటీ ఏమీ నిజనిర్ధారణ చేయలేదన్న వాస్తవం వ్యక్తమౌతుంది. కానీ భౌతికవా-ది అయిన కుమారసేనుడికి ఇలాంటి వాటిపై నమ్మకం లేదని రచయిత గుర్తు చేస్తూనే ఉంటాడు.

అందువల్లే రచయిత ఎక్కడా తను చెప్పదలచుకున్న అంశాన్ని వీడలేదని చెప్పొచ్చు. మహాకాయుడు ప్రత్యక్షమైన సింగప్పతో... "ఒరే ఎవడురా నువ్వు! మా దత్త మండలానికి వచ్చి నీ కేకల్తో, ఈ పొగల్తో మా అభివృద్ధి పనికి భంగం కల్గిస్తున్నావు" అంటాడు. ఇక్కడ గమనించాల్సిన విషయం దత్తమండలం అనే పద ప్రయోగం, మా అభివృద్ధి అన్న పదం, అంటే భూమిని దత్తత తీసుకున్న సెజ్ కంపెనీల వాళ్ల అభివృద్ధి అని స్పష్టం అవుతోంది.

రెండో భాగంలో కుమారసేనుడి స్వభావాన్ని, ఆలోచనా విధానాన్ని చెప్పిన రచయిత, నాలుగో భాగంలో ఆ పాత్ర పనిని తన కథా వస్తువు పరిధిని విస్తృత పరచడానికి వాడుకున్నాడు. 'పాడిపంటల రంగంలో గోక్షీరం లోతుపాతులూ చూసుకోరాదూ..." అని మహామంత్రితో కుమారసేనుడి సహమంత్రి పదవి పరిధిని చెప్పిస్తాడు. వెంటనే అవన్నీ భూమిపై ఆధారపడి ఉన్నవే అని సెజ్‌ల వల్ల కలిగే నష్టాన్ని సంపూర్ణంగా తెలియజేస్తాడు సూరసేనుడి మాటల్లో...

ఐదో భాగంలో భూములు మాయమయ్యే రహస్యాన్ని

ఛేదించడానికి కుమారసేనుడు, ఉపసేనాపతి వీరమల్లుడుతో బయలు దేరుతాడు. 32 ప్రదేశాల్లోని బిలరహస్యాలను పరిశీలిస్తాడు. ఆ సంక్షోభ ప్రాంతాలన్నీ నదీ సముద్ర తీర ప్రాంతాలు, అడవులు, కొండల్లో ఉంటాయి. 'సస్యశ్యామలమైన పొలాలు మొదలు మానవ నివాసాలు, నిర్జన పర్వతారణ్యాల దాకా ఉన్నాయి". అక్కడి ప్రజలు సెజ్‌ల వల్ల 'పిల్లా మేక, గొడ్డూగోద, తట్టాబుట్టా- అన్నీ వెంటబెట్టుకొని కదలిపోతున్నారు. ఊళ్లకి ఊళ్లే ఖాళీ అవుతున్నాయి. అవన్నీ బలవంతపు వలసలు గానే అన్పించాయి' అని అక్కడి సెజ్‌ల భూ స్వరూపాన్ని, వలసల వెనుక రహస్యాన్ని విప్పుతారు రచయిత.

**కవిత్వంలో ఓ టెక్నిక్ ఉంది. అదే భావచిత్రం. కవిత మొత్తంలో ఎక్కడో ఒక చోట కవి ఏమేమి చెప్తున్నాడో అర్థం చేసుకోడానికి ఓ క్లూ ఇస్తాడు. ఆ టెక్నిక్‌నే ఈ కథలో ఉపయోగించాడు. కవిత్వ రహస్యాలు తెలిసిన రచయిత. కథ రహస్యాన్ని పూర్తిగా అర్థం చేసుకోడానికి ఈ క్లూనే ఉపకరిస్తుంది**

రాజ్యాంగం ప్రకారం స్థానిక వనరులపై హక్కు అక్కడ నివసించే ప్రజలదే...(51వ అధికరణం) వినియోగంలో లేని భూమి, లేదా ఒక పంట పండే పొలాన్ని మాత్రమే సేకరించాలన్నది కేంద్ర ప్రభుత్వ సూచన కానీ అది ఎప్పుడో తుంగలో తొక్కబడిన విషయం రచయితకు సంపూర్ణంగా తెలుసని మనకు అర్థమౌతుంది. పై వాక్యాలే అందుకు బలమైన సాక్షీ భూతాలు. కుమారసేనుడు, వీరమల్లుడు తూర్పు కైవార రేఖ దగ్గరున్న బిలానికి చేరుకుంటారు.. అంటే రచయిత దృష్టిలో కృష్ణపట్నం లేదా కాకినాడ కావచ్చని నా ఊహ.. అక్కడే 50వేల ఎకరాలకు పైగా ప్రభుత్వం ఓ సంస్థకు అప్పగించింది. (కథలో 2వేల ఎకరాలు)

ఈ ఐదో భాగంలోనే రచయిత కథా వస్తువు ముడిని కూడా విప్పాడు. ఇదో కథాశిల్ప రహస్యం. నేరుగా పాఠకులకు విషయాన్ని చెప్పేశారు. మహాబిలం 'లోపల నుంచి రెండు రకాల శబ్దాలు మాత్రం వినపడుతున్నాయి. స్...స్...స్. అంటూ ఒక శబ్దం. కాసేపటికి జ్...జె...జె... అని మరొక శబ్దం రెంటిని కలిపితే (స్ ప్లస్ జ్)." అంటే సెజ్... రచయిత కథలో సెజ్‌ల పేరుతో ప్రభుత్వం ప్రజల భూమిని ఎలా లాక్కుంటుందో చెప్పదలచుకున్నాడని తెలిసిపోతుంది. కవిత్వంలో ఓ టెక్నిక్ ఉంది. అదే భావచిత్రం. కవిత మొత్తంలో ఎక్కడో ఒక చోట కవి ఏమేమి చెప్తున్నాడో అర్థం చేసుకోడానికి ఓ క్లూ ఇస్తాడు. ఆ టెక్నిక్‌నే ఈ కథలో ఉపయోగించాడు. కవిత్వ రహస్యాలు తెలిసిన రచయిత. కథ రహస్యాన్ని పూర్తిగా అర్థం చేసుకోడానికి ఈ క్లూనే ఉపకరిస్తుంది. సామాన్య పాఠకుడ్నీ ఆలోచించేటట్టు చేస్తుంది.

సెజ్‌ల మహాకృత రూపాన్ని వర్ణిస్తూ... 'అది మనిషీ కాదు, రాక్షసీ కాదు, రెండూ కలిసిన భీకరాకారం... దానికొక్కటే కన్ను, నాలుగు కబంధ హస్తాలు" అంటారు. దీనిలో ఒకటే కన్ను ప్రపంచీకరణలో ప్రపంచమంతా ఒకటే అన్న భావనలోని లోపాన్ని, జానపదకథల్లోని ఒంటి కన్ను రాక్షసి రెండు భావనలు దాగి ఉన్నాయి. ఒకటి వస్తువు, రెండోది శిల్పం. నాలుగు కబంధ హస్తాలు నాలుగు దిక్కులకు ప్రతీక. అందుకే నాలుగు దిక్కుల్లోని పంటచేలని, పశుపక్ష్యాదుల్ని, ఖనిజాల్ని ఆబగా తన గుహలాంటి నోటితో మింగేస్తున్నారు అని చెప్పేస్తాడు ఎటువంటి సంక్లిష్టతలకు తావివ్వకుండా రచయిత.

"వాడికి భోజన పరాక్రమం ఉన్నంతగా యుద్ధ పరాక్రమం లేదు" అని వాడటంలోని అంతర్యాన్ని అర్థం చేసుకోవడంలో... ఆర్థిక మండళ్ల వెనుక వ్యాపారదృష్టే కాని యుద్ధదృష్టి లేదనేది రచయిత ఉద్దేశం కావచ్చు. కానీ ఇదంతా ఓ మేధోపరమైన యుద్ధం. భౌతిక యుద్ధం కన్నా చాలా ప్రమాదకరమైనది అనే విషయాన్ని మరవకూడదు. ఆరో భాగం చివర్లో కుమారశేనుడికి, వీరమల్లుడికి జరిగే సంభాషణలో మనిషికి గుప్పెడు మెతుకులు సరిపోతాయి. ఒక్క ప్రాణికి ప్రపంచమంతా దిగమింగే అంతటి ఆకలి ఎందుకు? అనడంలో ఇప్పటి ప్రపంచీకరణ స్వభావాన్ని, అగ్రరాజ్య ఎత్తుగడలను ఎత్తిచూపడమే అవుతుంది.

ఏడో భాగంలో కుమారసేనుడు రాజు ఎదుట మహారాక్షసుడ్ని ప్రవేశపెట్టి... "వీళ్ల ఆకలి సామాన్యమైంది కాదు. గనులు, వనులు, పంటపొలాలు- ఏవీ మిగలడం లేదు... లక్షల మందికి దక్కాల్సిన సంపదంతా ఎవడో ఒక రాక్షసుడు అప్పనంగా భోంచేయటం సాంఘిక న్యాయానికే కాదు, ప్రకృతి న్యాయానికి కూడా విరుద్ధం కాదా?' అని రాజును ప్రశ్నిస్తాడు. 'అప్పనంగా' అన్న ఒక్క పదం చాలు ఈ సెజ్‌ల పట్ల కవికిగల దృక్పథం తెలుసుకోడానికి. అతనికి వాటి పై ఎంత వ్యతిరేకత ఉందో... ప్రజల పట్ల ఎంత మమకారం ఉందో..

రాజు ఎదురుగా ఉన్న మహాకాయుల్ని చూసి... "వాళ్లు మొదట మా సన్నిధికి వచ్చినప్పుడు మీలాగే గాలికి పడిపొయ్యేట్టున్నారు. ఇప్పుడు చూడండి. ఎంతెంత

దృఢకాయులుగా తయారయ్యారో?.. వారి అభివృద్ధే మన అభివృద్ధి... ప్రపంచం దినదినానికి మరింతగా విస్తరిస్తున్నది." అంటాడు. "వారికి విముక్తి కలిగించి, తిండి పెట్టి, సకల రాచమర్యాదలతో సాగనంపాలి" అంటాడు. దీని వెనుక సెజ్‌లపై, విదేశీ విధానాలపై, ప్రపంచీకరణ నేపథ్యంలో ఐ.ఎం.ఎఫ్, అగ్రరాజ్యాల కాళ్లకు మడుగులొత్తే రాష్ట్ర స్వభావాన్ని తేటతెల్లం చేసేశాడు రచయిత పాపినేని శివశంకర్.

ఐతే ముగింపు ఆశావాద దృక్పథంతో ఉండాలని కుమారశేషుడు ఆవాసం కోల్పోయిన వారితో కలిసి పోరాడటానికి సిద్ధమయ్యాడు అని రాస్తారు. 'మీ వాడిగా వచ్చాను - కలిసి పోరాడగా నిల్చినాను' అనే వాక్యాల ద్వారా చూపుతారు. దీనిని సినీయాటిక్ ముగింపుగా చెప్పొచ్చు.

రచయిత అనుభవం ఉన్న కథకుడు కావడంతో మ్యాజిక్ రియలిజాన్ని చక్కగా పోషించాడు. రాక్షసుడ్ని బంధించడం, మాంత్రికుడు సింగప్ప పూజలు చేయడం వంటి వర్ణనలు ఈ కథనంతో సరితూగాయి. ప్రారంభంలో భూమి మాయమవడం.. చివరకు ఆ భూమికోసం పోరాటానికి ప్రధాన పాత్ర సిద్ధమవటం... లాంటి ఎత్తుగడ, ముగింపుల సంబంధాలు రచయిత శిల్పదృష్టికి నిదర్శనం. కథను ఎనిమిది భాగాలు చేసినా మొదటి రెండు భాగాలు రెండు రెండు భాగాలుగా విభజించే అవకాశం ఉంది. బహుశా కథ కావడంతో క్లుప్తత పాటించాడేమో... సన్నివేశాలు, సంఘటనలు పరిపూర్ణంగా కథానిడివిలో కలిసిపోయాయి.

పాత్రల పేర్లు రచయిత ఎన్నుకున్న రాజుల కథా నేపథ్యాన్ని ముందుకు నడిపాయి. వాటి ప్రవర్తనా రీతికి, దృక్పథానికి ప్రతీకలుగా నిలిచాయి. రాజ్యాన్నే అంధక రాజ్యంగా చెప్పడం, రాజు-బంధక మహారాజు, కథానాయకుడు - కుమారశేషుడు, సేనాపతి- వీరమల్లుడు, కానీ మంత్రి పేరు సుమంత్రుడు అని పెట్టడంలో విశేషం ఏమిటో..!! అతనిదీ రాజు స్వభావమే... కానీ కుమారశేషుడి ప్రయత్నాలకి మాత్రం అడ్డుచెప్పని తత్వం. ప్రథమ పురుషలో కథనాన్ని నడిపే రచయిత అంతా తానుగా వ్యవహరించారు. అయినా మ్యాజిక్ రియలిజయంలో కథను అద్దంలో కాకుండా హృదయంపై ఆవిష్కరించారు.

పాత్రోచిత భాష కొన్నిచోట్ల పలికించడానికి ప్రయత్నించి.. మరికొన్ని చోట్ల రచయిత వదిలేశారు. సహజంగా జానపద పాత్రలు కొంత గ్రాంథిక వాసనల భాషలో మాట్లాడతాయి. కుమారశేషుడి పాత్రతో వ్యవహారికాన్ని పలికించి ఓ చోట మాత్రం... ప్రజలతో 'ఏమి నేరము చేసినారు మిమ్ము ఎవరిట్లు శిక్షించినారు" అంటాడు. ఆ ఊరి ప్రజల భాష నేరుగా ఉండటం ఉచితవే కావచ్చు. కానీ ఒకే పాత్రచే రెండు రకాల భాషను మాట్లాడటం సముచితమా... బహుశా రచయిత ఏదన్నా ఉద్దేశంతో పలికించారేమో... ఆలోచించాలి. అయినా.."పిల్లవానికేం తెలుసు ఉండేలు దెబ్బ?, రాజుల నవ్వులకు అర్థాలే వేరు, అడవిలో తినడానికి కాస్తంత బలుసాకు తీసుకెళ్లు, దిగితే కదా లోతు తెలిసేది." వంటి తెలుగు పలుకుబడులు కథలో కలిసిపోయి కథకు తెలుగు అందాన్ని తెచ్చాయి. ఆరో భాగంలో వీరమల్లుడి పేరు వీరసేనుడుగా ఉంది. ఇది ముద్రణ తప్పిదం కావచ్చు. "భీకర సౌందర్యం" పదప్రయోగం చేసి సౌందర్యం భీకరంగా ఉండదు అని చెప్పిన పాపినేని శివశంకర్‌కు ఈస్థటిక్స్‌పై కూడా పట్టు ఉంది. సంబంధిత పదజాలం పై కూడా సంపూర్ణ అవగాహన ఉంది. సెజ్‌లపై చాలా కథలు వచ్చాయి. సెజ్‌లను ప్రత్యక్షంగా పరిశీలించి, అక్కడి ప్రజలతో మమేకమై అనుభవాలను కథలుగా రాసిన వాళ్లూ ఉన్నారు. వాటిలో చాలా ఉత్తమ కథలుగా ఎన్న దగినవే... కానీ కథకు వస్తువు ఎంత ముఖ్యమో, శిల్పమూ అంతే ముఖ్యం. అవి రచనకు రెండు కళ్లు. చదివే వారికి చూపునిచ్చేవి. ఈ కథలో జమిలిగా అవి కలిసిపోయాయి. అందుకే ఈ కథను ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

మొత్తం మీద మాయాబిళ రహస్యం కథ పేరుకు తగ్గట్టు ఓ జానపద చిత్రాన్ని చూసిన అనుభూతి ఇస్తుంది. వస్తువు శిల్పంతో కలిసిపోయి పాఠకుడ్ని ఆకట్టుకుంటుంది. రచయిత ఎప్పుడూ ఒక రచనను ఈ రూపంలో రాయాలి అని నిర్ణయించుకోడు. తనలో కలిగిన భావావేశమే రూపాన్ని ఎంచుకుంటుంది. ఈ కథలో కూడా వస్తువే కథనశిల్పాన్ని రూపొందించుకుంది. అందుకే సామాన్యులకు అంతుచిక్కని ప్రపంచీకరణ స్వభావాన్ని, సెజ్‌ల గుట్టును, ప్రభుత్వ లోగుట్టును చిక్కని శిల్పంతో బయటపెట్టింది. కథలో రచయితే చెప్పినట్టు దుర్భిణిలో చూపెట్టింది.



***రచయిత ఎప్పుడూ ఒక రచనను ఈ రూపంలో రాయాలి అని నిర్ణయించుకోడు. తనలో కలిగిన భావావేశమే రూపాన్ని ఎంచుకుంటుంది. ఈ కథలో కూడా వస్తువే కథనశిల్పాన్ని రూపొందించుకుంది. అందుకే సామాన్యులకు అంతుచిక్కని ప్రపంచీకరణ స్వభావాన్ని, సెజ్‌ల గుట్టును, ప్రభుత్వ లోగుట్టును చిక్కని శిల్పంతో బయటపెట్టింది. కథలో రచయితే చెప్పినట్టు దుర్భిణిలో చూపెట్టింది.***

# ఇక్కడొక ఊరుండాలి ! ఏది?

- దుప్పాడ రామకృష్ణ నాయుడు
8790408525



తెల్లవారింది
ఎర్రచొక్కా తొడుక్కొని చుర్రుమంటున్న సూరీడు
పశ్చిమ దిశగా పరుగందుకున్నాడు
వేకువెప్పుడయ్యిందో ఎవరికీ తెలియదు
కొక్కొరోకో అని ఏకోడీ కూయలేదు
కోళ్ళింకా నిద్రలేవ లేదేమో
అసలు కోళ్ళేవి కూసేందుకు?
గూళ్ళేవి వాటిని మూసేందుకు?
శ్వేతాంబరులై చెయ్యని తప్పుకు శిక్షనుభవిస్తూ
ఊరి నుండి వెలియవేయబడి
పౌకల ఫారాలలో మూకుమ్మడిగా మూలుగుతున్నాయి
బారెడు పొద్దెక్కింది
అంబా అంటూ ఏదూడా అరవలేదు
ఆవేది దూడను సాకేందుకు?
అసలు భూమేది "ఆవులు" మేసేందుకు?
వందల వేల ఎకరాలు బలవంతపు భూసేకరణతో
బడాపారిశ్రామిక వేత్తలకు భారీగా తరలిపోగా
నిలువనీడలేక నిర్వాసితుడైన "రైతు"
కుటుంబ బ్రతుకు కోసం కూలోడై
కట్టు బట్టలతో కాళ్ళీడ్చుకుంటూ
పనినెతుక్కొనే పనిలో పట్నమెల్లే బస్సెక్కి
కన్నీరొలికే కళ్ళతో నేల తల్లిని కడసారి చూసుకుంటూ
ఉసూరుమంటూ వూరొదిలి పోయాడు
ఈ యేడు సంక్రాంతి ఏసందడీ చేయలేదు
"హరిదాసు" పాటాలేదు "గంగిరెద్దు" ఆటాలేదు
అసలు యిల్లేది?
హరిదాసును ఆదరించేందుకు గంగిరెద్దును
స్వాగతించేందుకు
ఇంతకూ యిల్లాలేది?
ఇంటి ముంగిట రంగు రంగుల రంగవల్లులేసేందుకు
తీసుకున్న అప్పులు తీర్చలేక "అన్నదాత"
ఉరికొయ్యన వేలాడి ఉసురు తీసుకుంటే
చావలేక బ్రతకలేక
ముఖం దాచుకుంటూ మూలన కూర్చుంది
వసంత మెప్పుడు వచ్చివెళ్ళిందో
మావి చిగురు జాడేలేదు "కోయిలమ్మ" పాటేలేదు
చెట్టేది కోయిలమ్మ వాలేందుకు?
అసలు తోటేది చెట్టంటూ వుండేందుకు?
సూటు బూటు లేసుకున్న మాటల మాయగాళ్ళ
రియ లెస్టేటు వ్యాపారంలో
సంతలో సరుకై అమ్ముడయిపోయి
తోటెప్పుడో నేలకూలిపోగా
బిక్కు బిక్కు మంటూ దిక్కులు చూస్తూ "నేల"
అమ్మకానికి పెట్టిన ఆవులా అంగడిలో నిలబడగా
పొట్టచేత పట్టుకొని "తోటమాలి"
ఆకలి బాధతో ఆశల రైలెక్కి
బ్రతుకు స్టేషన్నెతుక్కుంటూ బయలెల్లిపోగా,
మహానగర మాయగాడిని మనువాడి
కళ్ళనీల్లు పెట్టుకుంటూ
నేల తల్లి వద్ద శలవు తీసుకొని
బాధతో బరువెక్కిన మనసుతో
కష్టాల పల్లకి నెక్కి "పల్లె"
పట్నంలో అత్తవారింటికి ఎప్పుడో పయనమై పోగా
ఉన్నత చదువుల కోసం
వూహ తెలియని వయసులో వూరొదిలిపోయి
ఉద్యోగమొచ్చాక వూరు చూడాలనిపించి
కారులో నేరుగా వచ్చి
ఇక్కడొకవూరుండాలి! ఏది? అని
అమాయకంగా ఎవరో అడిగితే
ఏం చెప్పాలో తెలియక
బాధతో గుండె బరువయ్యింది
నోట మాట రాక మనసు మూగయ్యింది.



కథ

# అంతర్మథనం

బొందల నాగేశ్వరరావు
095000 20101




నేను అల్పాహారం ముగించుకుని తీరుబడిగా వాలుకుర్చీలో వాలాను. అప్పుడు మా వీధిలో కేకలు వినబడ్డాయి. ఏమై ఉంటుందోనన్న ఆదుర్దాతో లేచి బయటికి నడిచాను. నాకన్నా ముందే మా ఆవిడ బయటకెళ్లింది. ఇద్దరం అటు వీధిలోకి చూశాం. దాదాపు వీధిలో ఉన్న అందరూ మా ఇంటి వరుసలోని నాలుగో ఇంటి ముందు గుమిగూడి ఉన్నారు. అక్కడ ఓ ట్రై సైకిల్ మీద షామియానా, బొంగుకర్రలు, కుర్చీలు వున్నాయి. ఒకతను పలుగుతో గుంతలు తీయడానికి ప్రయత్నిస్తుండగా, ఆ ఇంటికి ఎదురింటి చలపతి వాళ్ళతో గొడవపడుతున్నాడు. దూరంగా ఉండడం వల్ల నాకేమి అర్థం కాలేదు. అయినా మా వీధిలో గొడవ జరుగుతుంటే అలా ఊరకుండిపోవడం ధర్మం కాదనుకున్నాను. పైగా ఏదేని సమస్యకు గొడవలొస్తే ఓ పెద్ద మనిషిగా నన్నే తీర్చిపెట్టమంటారు. కనుక వెళ్లి కారణం తెలుసుకుని వాళ్లను సమాధానపరచాలనుకుని 'మనకెందుకులే ఆగండి' అని మా ఆవిడ అంటున్నా వినకుండా గొడవ జరుగుతున్న ఇంటి వద్దకు వెళ్లాను. నన్ను చూస్తూనే అంతగా ఎదురింటి సత్యమూర్తితో గొడవపడుతున్న చలపతి గొంతు కాస్త స్వరం తగ్గించి "సార్! ఈ విషయంలో మీరు జోక్యం కల్గించుకోకండి" అని మళ్ళీ అటు తిరిగి 'ఇదిగో అబ్బాయ్! ఇక్కడ షామియానా వేయడానికి వీల్లేదు'' అన్నాడు సత్యమూర్తితో.

"అలా అనకండి సార్! ఇది వీధి. అందరికీ కామన్. ఇక్కడ కుదరదంటే మరెక్కడ వేసుకోవాలో చెప్పండి?''

అడిగాడు సత్యమూర్తి. అప్పుడు వాళ్లిద్దరి వాదనలను, ఇంటి ముందు గుమిగూడి వున్న జనాన్ని బట్టి నాకు విషయం మొత్తం అర్థమైపోయింది. అంటే వ్యాధితో నెలరోజులుగా ఆస్పత్రిలో ఉన్న ఆ నలుగురు అన్నదమ్ముల ఎనభైయేళ్ల తల్లి పార్వతమ్మ గారు పోయారని, అందుకు ఇంటి ముందు బంధువులు, ఇరుగు పొరుగుల దర్శనార్థం అక్కడ షామియానా వేస్తున్నారని.



అంతలో సత్యమూర్తి రెండో తమ్ముడు రామ్మూర్తి నా వద్దకొచ్చాడు. అతని ముఖంలో విషాదఛాయలు కొట్టొచ్చినట్టు కనబడుతున్నాయ్.

"మా అమ్మ పోయారండి! ఓ పావుగంటలో ఆస్పత్రి నుంచి బాడీని అంబులెన్స్‌లో మా తమ్ముళ్లు తీసుకొస్తున్నారు. బంధువులు, ఇరుగు పొరుగుల ఆఖరిచూపు కోసం ఇంటిముందు ఉంచాలని షామియానా వేయను పూనుకున్నాం. కుదరదని గొడవ చేస్తున్నాడీ పెద్దమనిషి. మీరైనా సర్దిచెప్పి పని జరిగేలా చేయండి ప్లీజ్" అని వేడుకొన్నాడు.

చలపతి, నేను సమాన వయస్కులం. వీధిలో పెద్దవాళ్లం కనుక కాస్త చొరవతో "చూడు చలపతి! ఏమిటీ గొడవ? వాళ్లింటిముందు షామియానా వేసుకోవడంలో నీకొచ్చిన నష్టమేంటి? పైగా వీధిలో ఎలాంటి శుభకార్యాలు జరిగినా పెద్దలం మనం పాల్గొంటూ ఉంటాం. అలాగే ఇది బాధతో కూడుకున్న విషయం. సహకరించండి ప్లీజ్. ఓ మూడు గంటలేగా" అంటూ సర్దిచెబుతుంటే అస్సలు వినకుండా వెళ్ళి గుంత తవ్వుతున్న వ్యక్తి చేతిలోని పలుగును లాక్కున్నాడు చలపతి. నాక్కొంచెం కోపం వచ్చింది.

"మీరేంటి మధ్యలో, చూడండి! వాళ్లు వేయబోయే షామియానా నా ఇంటివైపు ప్రహరీగోడ వరకు వస్తుంది. అప్పుడు జనం ఏమనుకుంటారో తెలుసా... పిల్ల జల్లా లేని వాళ్లం. ఏకంగా నేనో, మా ఆవిడో పోయారనుకుంటారు. ఆ సన్నివేశాన్ని ఊహిస్తేనే నాకు భయంగా ఉంది. అందుకే నాకిష్టం లేదు. ఇదిగో..... షామియానా కాదు కదా, శవాన్ని చూడనొచ్చే జనం కూడా నా ఇంటి ముందు కుర్చీల్లో కూర్చోవడం ఇటూ అటూ తిరగడం, సంతాప శోకాలు పెట్టడం నాకిష్టం లేదు. అవి చూస్తూ నేను భరించలేను" అంటూ రెచ్చిపోయాడు చలపతి నా మాటక్కూడా విలువివ్వకుండా.

ఇక అక్కడ ఉన్న నలుగురూ నాలుగు విధాలుగా అతన్ని "మనం ఒకే వీధిలో వాళ్లం. అన్నదమ్ముల్లా ఉంటున్నాం. మంచికైనా, చెడుకైనా కలిపి నడుస్తున్నాం. దయచేసి ఇందుకు ఒప్పుకుని షామియానాను వేసుకోనివ్వండి చలపతిగారు' అంటూ గడ్డం పట్టుకుని బ్రతిమాలారు. చలపతి ససేమిరా అంటూ కఠినంగా మారిపోయాడు.

అంతలోనే అంబులెన్స్ వచ్చింది. అంబులెన్స్‌ని చూస్తూనే ఇంట్లో ఉన్న నలుగురు కోడళ్లు ఏడ్పులంకించుకున్నారు. గొడవ సాగుతూనే ఉంది.

తల్లి పార్థివ దేహంతో వచ్చిన ఆమె ఇద్దరు కొడుకులు సాంబమూర్తి, జ్ఞానమూర్తి విషయాన్ని పసిగట్టారేమో! హాల్లోనే ఉంచుకోవడానికి ఏర్పాట్లు చేసుకొని అతి కష్టం మీద ఫ్రీజర్ బాక్సును బంధువుల సహాయంతో మెల్లగా తీసుకెళ్లి హాలు నడుమ ఉంచడంతో బయట షామియానా గొడవ సర్దుమణిగింది. అక్కడున్న అందరూ ఆ నలుగురు కొడుకుల తల్లిని ఆఖరి చూపులు చూసి శ్రద్ధాంజలి ఘటించడానికి ఒకరివెనుక ఒకరు లోనికెళ్లి ఆమె పార్థివ దేహాన్ని దర్శించుకొని దండల వేసి దణ్ణం పెట్టుకుని వెళ్లిపోతున్నారు. ఆమె కోడళ్లు, మనువలు, మనువరాళ్లు చుట్టూ కూర్చుని ఏడుస్తూ ఉండిపోయారు. ఇంత జరుగుతున్నా చలపతి, అతని భార్య జాడలు ఆ ప్రాంతంలో కనబడలేదు నాకు.

నేనూ అటే బజారుకెళ్లి ఓ గులాబి దండను తీసుకొచ్చి ఆమె పార్థివ దేహంపై ఉంచి దణ్ణం పెట్టుకొని పెద్దవాడు సత్యమూర్తిని సమీపించి "డబ్బు ఏమైనా కావాలా?" అడిగాను.

"అక్కర్లేదు సార్! మీ అభిమానం ఉంటే చాలు" అంటూ నా రెండు చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొని కన్నీళ్లు పెట్టుకున్నాడు. ఆ సమయాన నాకు దు:ఖం తన్నుకురాగా అతి కష్టం మీద ఆపుకుని ఎందుకో అనుకోని విధంగా అటు చలపతి ఇంటివైపు చూశాను. తలుపులు మూసి వున్నాయ్. ప్రహరీగోడ లోపలవైపు తాళం వేసి ఉంది. అందాక ప్రహరీగోడ బయటున్న ఖాళీ అరుగుల మీద ఇప్పుడు ఏవో వస్తువులు కనబడ్డాయి. అంటే అరుగులు మీద ఎవరూ కూర్చోకూడదన్న ఉద్దేశ్యంతో అప్పుడే ఆ వస్తువుల్ని అక్కడుంచాడు చలపతి. అలా మెల్లగా వాళ్లింటి కిటికీవైపు చూశాను. బయట

జరుగుతున్న తతంగం మొత్తాన్ని కిటికీలోంచి చూస్తున్నారు భార్యాభర్తలిద్దరూ. నన్ను గమనించిన వాళ్లు దబేలున కిటికీ తలుపుల్ని కూడా మూసేశారు.

బాధేసింది నాకు. "చలపతి ఇంతటి కఠినాత్ముడా, ఛీ!" అనుకున్నాను. నిజం చెప్పాలంటే ఈ లోకానికి ఎవరూ శాశ్వతం కాదు. చావుకి చిన్నా పెద్దా తేడా లేదు. పేద, ధనిక తారతమ్యాలు లేవు. ఆ భగవంతుడు ఏ సమయంలో ఎవర్ని పిలిచినా వెళ్లడానికి సిద్ధంగా ఉండాలంతే! ఇది ప్రకృతి ధర్మం. మృత్యువు విషయంలో ఎవరెంతటివారైనా సరే ఉన్న ఆస్తిపాస్తులు, కీర్తి ప్రతిష్టలు, పలుకుబడి హోదాలు సైతం విడిచిపెట్టాల్సిందే. ఇక మనిషి భూమ్మీద బ్రతికినన్నాళ్లు తను చేసిన దానధర్మాలు, పుణ్యకార్యాలు, మంచి మానవత్వాల గూర్చి జనం మాట్లాడుకునేదాన్ని బట్టి మరణించిన వ్యక్తి యొక్క విలువలు తెలుస్తాయి.



అవును, ఇప్పుడిక్కడ ఆ నలుగురన్నదమ్ముల తల్లి బ్రతికున్నన్నాళ్లు నలుగురుతో మంచిగా ఉంటూ తను చేసిన మంచి పనుల గూర్చి, దానధర్మాల గూర్చి జనం మాట్లాడుకుంటున్నారు. ఈ రోజుతో ఆ మహాతల్లి శకం ముగిసిపోయినా ఆమెలోని మంచితనం, మానవత్వం, ధర్మగుణాలన్నవి కొన్నాళ్లపాటు మా మధ్య గుర్తిండిపోతాయని అనుకోవడంలో సందేహం లేదనుకుంటూ అంత్యక్రియల్లో పాల్గొనే నిమిత్తం నేనూ స్మశానవాటికకు నడిచాను.

రెండ్రోజుల తరువాత చలపతిని చూసి మాట్లాడి రావాలనుకుని బయల్దేరిన నన్ను 'అంతటి కఠినాత్ముడు చలపతి అన్నయ్యా. ఆయనతో మీరెళ్లి మాట్లాడ్డమేంటి? తను జరిగినదానికి పశ్చాత్తాపడి మీతో మాట్లాడాలని వస్తే మాట్లాడండి' అంటూ మా ఆవిడ అనడంతో ఆగిపోయాను. మొత్తానికి ఆ రోజు పెద్దావిడ పార్థివదేహాన్ని నలుగురు కొడుకులు, వీధి జనం స్మశానానికి తీసుకెళ్తుంటే ఇంట్లోంచి కిటికీ ద్వారా చూస్తూ లోపలే ఉండిపోయారు చలపతి దంపతులు. పెద్దావిడ చావు వాళ్లను భయభ్రాంతులను చేయడమే గాక వాళ్ల అంతరాత్మ వాళ్లను నిలదీసిందేమో దానికి సరైన సమాధానం చెప్పుకోలేక ఓ వారంపాటు ఇంటికే పరిమితమయ్యారు. వీధి జనాలతో సైతం బంధం విడిపోయినట్లు ఏకాంతంలో గడిపారిద్దరూ. చివరికి నా వద్దకు రావడానికిక్కూడా చలపతికి మొహం చెల్లలేదని గ్రహించాను.

ఈలోపు అనుకున్న ప్రకారం మా పెద్దబ్బాయి పిలుపుమేర నేను, మా ఆవిడ అమెరికాకు వెళ్లిపోయాం. అక్కడ మా అబ్బాయి, కోడలు, మనవడు, మనువరాలితో హాయిగా ఉంటూ మా వాడు చూపిన ప్రదేశాలను చూసి మన ఆంధ్రా నుంచి తీసుకెళ్లిన పిండివంటలు, అమెరికన్ స్టైల్ ఫుడ్స్ తింటూ వాళ్ల కల్చర్‌కి అనుగుణంగా ఆనందంగా గడుపుతూ వచ్చాం ఓ మూడేళ్లు. తరువాత మమ్మల్ని ఇండియాకి పంపాడు మా పెద్దబ్బాయి.

ఎయిర్‌పోర్టు నుంచి కాల్‌టాక్సీలో ఇంటికొచ్చాం. నేను గేటు తాళం తీశాను. మా ఆవిడ ఇంటి తలుపులు తెరచి లోనికెళ్లింది. నేను అక్కడే గేటుకి కట్టి ఉంచిన తపాలా పెట్టెలోని ఉత్తరాలను తీసుకొని లోనికెళ్లి సోఫాలో కూర్చుని అవి ఎక్కడినుంచి వచ్చాయోనని అడ్రస్‌లు చూస్తుండగా అందులో చలపతి దస్తూరీతో ఓ ఉత్తరం ఉంది. అదిరిపోయాన్నేను. మేము అమెరికాలో ఉండగా ఈ మధ్యే చలపతి క్యాన్సర్ వ్యాధితో చనిపోయాడని, వాళ్ల ఎదురింటి నలుగురన్నదమ్ముల్లో పెద్దవాడైన సత్యమూర్తి నాకు ఫోన్ చేసి చెప్పాడు. మరి ఈ ఉత్తరం ఏంటి? దీన్ని చలపతి ఎప్పుడు రాశాడు? ఎందుకు రాశాడు?

నాలో నాకు తెలియని టెన్షన్‌తో కూడుకున్న ఆదుర్దాతో ఉత్తరాన్ని తెరచాను. అందులో...

రాఘవయ్య గారికి!

సార్ ! ఈ ఉత్తరాన్ని నేను క్యాన్సర్ ఇన్సిటిట్యూట్ నుంచి రాస్తున్నాను. మొదటగా మీరు నన్ను క్షమించాలి. ఆరోజు... అదేనండి.... మా ఎదురింటి పెద్దావిడ చనిపోయినరోజు ఆమె పార్థివదేహాన్ని ఉంచడానికి తీసుకొచ్చిన ఫ్రీజర్ బాక్సును వాళ్ల బంధుమిత్రుల దర్శనార్థం ఓ మూడు గంటలపాటు ఇంటి ముందు షామియానా వేసుకొని ఉంచి, స్మశానానికి తీసుకువెళ్తామన్న ఆమె కొడుకులు సత్యమూర్తి, రామ్మూర్తి, సాంబమూర్తి, జ్ఞానమూర్తుల కోరికను త్రోసిపుచ్చి వాళ్లను నొప్పించి షామియానా వేయడం మూలాన ఇంటిలో ఎవరైనా చనిపోయారని నలుగురు అనుకుంటారన్న భయంతో మిమ్మల్ని

సైతం ఎదిరించి దాన్ని వేయడం ఆపించాను. అందర్నీ బాధపెట్టి తలుపులు మూసుకుని నేను, నా భార్య ఇంట్లోనే ఉండిపోయాం. అందుక్కారణం నాకు చావంటే భయం. అవునుసార్! పెద్దావిడ చనిపోయే నాటికే నాకు క్యాన్సర్ జబ్బు రెండో స్టేజ్‌లో ఉంది. అది అప్పటికే నన్ను మెల్లమెల్లగా కఠినంగా మారిపోయి నిర్దాక్షిణ్యంగా నడుచుకున్నాను. అయితే అందరూ ఏదో ఒకరోజు చనిపోతారన్న నిజాన్ని గ్రహించలేకపోయాను. ఇప్పుడు నేను మృత్యువుతో పోరాడుతున్నాను సార్! అది నా వెంటపడి నన్ను తరుముకొస్తోంది. ఏ క్షణంలోనైనా నన్ను అది కబళిస్తుంది. బహుశా మీరు అమెరికా నుంచి వచ్చేలోపు నేనుండనేమో!



సార్! ఆ రోజు నేను ఓ మనిషినన్నది మర్చిపోయి గుండెను బండ చేసుకుని విచక్షణారహితంగా, దారుణంగా వాళ్లపట్లే కాక మన వీధిలో ఉన్న వాళ్లందరితోను అలా నడుచుకొన్నాను. ఇప్పుడు ఊహిస్తే ఆనాటి నా చేతలు నన్ను తలవంచుకునేలా చేస్తున్నాయి. ఈ సంగతి మీతో చెప్పుకొని క్షమాపణ కోరుకొని మనసును తేలిక చేసుకొని మళ్లీ అందరితో కలిసిపోవాలని నా మనసు ఆరాటపడుతుంటే పదిరోజుల తరువాత మీ వద్దకొచ్చాను. అయితే అప్పటికే మీరు అమెరికా వెళ్లిపోయారు. ఆ మరుసటిరోజే వ్యాధి తీవ్రత వల్ల నేను ఆస్పత్రిలో చేరాను. ఇక ఎటూ మిమ్మల్ని చూడలేనన్న ఉద్దేశంతో ఈ ఉత్తరాన్ని రాస్తున్నాను. జరిగింది మర్చిపోయి నన్ను క్షమిస్తారని నమ్ముతాను క్షమిస్తారు కదూ!

**మీ పొరుగింటి చలపతి**

ఉత్తరాన్ని మొత్తం చదివిన నాకు కళ్లు చెమర్చాయి. దు:ఖం పెల్లుబికింది నాలో. ఆరోజు అలా నడుచుకున్నందున అతని అంతరాత్మ గద్దిస్తుంటే దానికి భయపడి మంచిగా మారి క్షమాపణ కోరిన చలపతికి పశ్చాత్తాపమే ఊరటనుకొని అతన్ని తలచుకున్నాం నేను, మా ఆవిడ.

అంతలో తలుపు చప్పుడైంది. వెళ్లి తలుపు తీసింది మా ఆవిడ. ఎదురుగా నిత్యం పసుపు కుంకుమ పూలతో కళకళలాడుతూ మహాలక్ష్మిలా కనబడే చలపతి శ్రీమతి సాధారణంగా కనబడింది.

అలా ఆమెను చూసిన నేను 'రామ్మా' అంటూ లోనికి ఆహ్వానించాను. కట్టలు తెంచుకొన్న దు:ఖంతో 'వదినా' అంటూ ఏడుస్తూ వచ్చి మా ఆవిడ అక్కున చేరిందామె. మేమూ దు:ఖాన్ని ఆపుకోలేకపోయాం.

"అన్నయ్యగారూ! మమ్మల్ని క్షమించండి. పెద్దావిడ చనిపోయిన రోజు షామియానా వేయించకుండా అడ్డుపడడానికి కారణం నేను, నా వల్లనే ఆయన ఆమె కొడుకులతో గొడవపడ్డారు. అవును అన్నయ్యగారూ! మా ఇద్దరికీ మృత్యువంటే భయం. అందుకే అలా జరిగింది. అయితే అందరం ఏదో ఒకరోజు ఆ మృత్యువాత పడతామని ఊహించలేకపోయాను" అంటూ కన్నీళ్ల పర్యంతమైంది చలపతి భార్య.

"ఫర్వాలేదమ్మా! ఇప్పుడివన్నీ ఎందుకు"

"చెప్పుకోవాలి అన్నయ్యగారూ! మీతో చెప్పుకుంటేనే నా మనసు కుదుటపడుతుంది. నాకు ఊరట కలుగుతుంది. అన్నయ్యగారూ! ఎదురింటి పిల్లల పట్ల అలా నడుచుకొని వాళ్లనెంతో క్షోభకు గురిచేశాను. అయితే వాళ్లు మా వారు పోయిన రోజు నాకు... ఈ గొడ్రాలికి, ఏ దిక్కూ లేని అనాథకి కొడుకుల్లా మారిపోయి ఆస్పత్రిలో ప్రాణాలను కోల్పోయిన మా వారికి అన్నీ వాళ్లే అయ్యి ఇంటికి తీసుకొచ్చి నలుగురి దర్శనార్థం ఎదురెదురే ఉన్న మా ఇళ్ల నడుమ ఉంచి అన్ని కార్యక్రమాలు వరుసగా చేసి దహన క్రియలు సైతం ముగించారు. ఇక పెద్దావిడ కోడళ్లు నన్ను వాళ్ల తల్లిలా భావించుకుని దు:ఖంలో పాలుపంచుకుని దహన క్రియలు పూర్తయిన తరువాత నా చేత ఎంగిలి చేయించి ఇంటికి వెళ్లారు. ఈ సంగతి మీతో చెప్పుకుని ఊరట పొంది ఇకనైనా నలుగురితో కలిసి జీవించాలని నిర్ణయించుకున్నాను. అందుకే వచ్చాను. ఇప్పుడు ఆ నలుగురన్నదమ్ములను నా పిల్లలుగా భావించుకుంటున్నాను అన్నయ్యగారూ!" ఉద్వేగంగా అంది చలపతి భార్య.

"మంచిదమ్మా! నీలో కలిగిన మార్పును శ్లాఘిస్తున్నాను. నీకు అండగా ఆ నలుగురు పిల్లలే కాదు, మేము కూడా వున్నాం" అంటుండగా ఆమె రెండు చేతులతో మాకు నమస్కరిస్తూ కళ్ల వెంట కారుతున్న కన్నీళ్లను తుడుచుకుంది.



కవిత

# పోరాడే...ప్రయాణం..

- యం.శబరిష్
9885566388



నా దారిలో నా ప్రయాణం
ఆత్మవిశ్వాసంతో సాగిపోతూవుంది.
నన్ను చూసి అటువైపు వాళ్లు
అయ్యోపాపం అని అన్నారు.
ఇటువైపు వాళ్లు
పూర్వజన్మలోని
కర్మేమో అని అంటున్నారు.
వారిమాటలు తూటాల్లా
నావైపుకి వస్తున్నా
అవి నా నీడనుకూడా తాకడంలేదు.
ఎందుకంటే నా దారిలో నా ప్రయాణం
ఆత్మవిశ్వాసంతో సాగిపోతూవుంది.
వారు నన్ను అంగవైకల్యుడని
విజయాన్ని సాధించలేనని అన్నారు.
వాళ్లకి తెలీదేమో ఓటమి
నా కాళ్ల దగ్గరే దాక్కునివుందని.
అవయవాలు ఎక్కువైనా తక్కువైనా
వింత జంతువులా చూస్తూ
వికలాంగుడని నామకరణం చేస్తారు.
అయిదారు చేతులు తలలూ వున్న
దేవుళ్లు వికలాంగులు కారా ?
వారి మాటలు నిరుత్సాహ చీకట్లోకి
నన్ను నెట్టాలనిచూస్తున్నా
నా నడక ఆగడం లేదు .
ఎందుకంటే నా దారిలో నా ప్రయాణం
ఆత్మవిశ్వాసంతో సాగిపోతూవుంది.
పూట పూటకు ఒక బరువైనమాట
నాపై నెట్టబడుతోంది. అందుకే
మూగబోయిన నా మాటను
అక్షరాల్తో తెలుపుతున్నాను.
చూడలేని ఈ ప్రపంచాన్ని
నా మనసుతో అంచనావేస్తున్నాను.
నడవలేకపోయినా
నా జీవితాన్ని ఆనందంగా గడిపి
ముందుకు నడిపిస్తున్నాను.
నేను ఈ సమాజంతో
అనుక్షణం పోరాడుతూనే వున్నాను.
ఎన్ని పోరాటాలు జరిగినా
నాకు గాయం అవ్వనేలేదు.
ఎందుకంటే నా దారిలో నా ప్రయాణం
ఆత్మవిశ్వాసంతో సాగిపోతూవుంది.
ఎవరన్నారు నేనొక వికలాంగుడని
ఎవరన్నారు కాలం పెట్టే పరీక్షకి
నేనొక బానిసననీ.
విధిని ఎదిరించి పోరాడుతున్న నేను
ఓ సైనికుడిని.
నా గుండెగాయాల్ని
నయం చేస్కుని
దృఢంగా తయారైన నేను
ఓ వైద్యుడిని.
జీవితాన్ని పాక్కుంటు దొర్లుకుంటూ
నాల్గుకాళ్ల మంచంపైనే
నిర్జీవంలేకుండా ఉన్నట్లు
గడపవచ్చుని తెలిపిన నేను
ఓ శాస్త్రవేత్తను .
వెర్రిచూపులు చూసే
ఈ సమాజాన్ని మార్చే నేను
ఓ నాయకుడను.
ప్రపంచంలో జీవితాన్ని సంతృప్తిగా
జయించే ఏకైక వీరుడను
ప్రత్యేక ప్రతిభావంతుడను
నేను ... నేను మాత్రమే ....!
ఎందుకంటే
నా దారిలో
నా ప్రయాణం
ఆత్మవిశ్వాసంతో
సాగిపోతూవుంది.



## నచ్చిన రచన

# దళిత జీవిత వాస్తవిక చిత్రణ

బిరుసు సురేష్‌బాబు
7569480800




***ఈ కథలన్నింటిలో కేంద్రం దళిత స్త్రీ. అందునా దళిత క్రైస్తవ స్త్రీ. అయితే ఈ రెండు విభాగాల వారిని వేరు చేసే ఉద్దేశం కాదు. అది మత విశ్వాసాల్లో తేడానే గానీ జీవితంలో కాదు. అంటరానితనాన్ని తప్పించుకోవడానికి హిందూ దళితులు క్రైస్తవత్వాన్ని పుచ్చుకుంటే, హిందూమతం క్రైస్తవత్వాన్నే అంటరానిదిగా మార్చింది. ఈ నేపథ్యంలో ఈ కథల్ని అర్థం చేసుకున్నప్పుడు ఈ తేడాలు మనకు కనిపించవు.***

తెలుగు సాహిత్యంలో సామాజిక స్పృహతో కాకుండా ఆనందంకోసమో, కాలక్షేపం కోసమో కథలు రాసే వాళ్ళే ఎక్కువగా ఉన్నారు. దుర్భరజీవితాలకు ఎలాంటి మెరుపులు, వర్ణనలు, రంగులు అద్దకుండా వాస్తవ జీవితాన్ని యథాతథంగా మలిచే అతి కొద్దిమంది రచయితల్లో ఎమ్.ఎమ్ వినోదిని ఒకరు. సామాజిక కార్యకర్తగా సమాజాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకొన్న ఆమె కలం నుండి జాలువారిన కథలన్నీ నిస్సందేహంగా పదునైనవే. ఈ విషయాన్నే ఆమె రాసిన 'బ్లాక్ ఇంక్' కథలు స్పష్టం చేస్తున్నాయి.

బ్లాక్ ఇంక్ కథా సంపుటంలో మొత్తం 11 కథలు ఉన్నాయి. వీటిని కథలు అనడం కంటే దళిత స్త్రీ వ్యథలు అనడం సమంజసంగా ఉంటుందేమో. ఈ కథలు కల్పితాలు కావు. మిశ్రమాలు అసలే కావు. రచయిత్రి ఎమ్.ఎమ్.వినోదిని దళిత క్రైస్తవ స్త్రీ. ఆ నేపథ్యం నుండి వచ్చిన కథలే ఇందులో ఎక్కువగా ఉన్నాయి. ఆమె తన అనుభవాలను, అతి దగ్గర నుండి చూసిన దళిత స్త్రీల జీవితాలను, పురుషాధిక్య సమాజంలో, కులాధిక్య సమాజంలోనూ దళిత స్త్రీ దైన్యాన్ని సూక్ష్మాతి సూక్ష్మంగా పరిశీలించి రాసిన కథలు ఇందులో ఉన్నాయి. జీవితాలు ఇలా ఉంటాయా అని చాలామంది ముక్కున వేలు వేసుకొని నివ్వెరపోయే వాస్తవ జీవితాలను వినోదిని ఈ కథల్లో సజీవంగా నిలిపారు.

ఈ కథలన్నింటిలో కేంద్రం దళిత స్త్రీ. అందునా దళిత క్రైస్తవ స్త్రీ. అయితే ఈ రెండు విభాగాల వారిని వేరు చేసే ఉద్దేశం కాదు. అది మత విశ్వాసాల్లో తేడానే గానీ జీవితంలో కాదు. అంటరానితనాన్ని తప్పించుకోవడానికి హిందూ దళితులు క్రైస్తవత్వాన్ని పుచ్చుకుంటే, హిందూమతం క్రైస్తవత్వాన్నే అంటరానిదిగా మార్చింది. ఈ నేపథ్యంలో ఈ కథల్ని అర్థం చేసుకున్నప్పుడు ఈ తేడాలు మనకు కనిపించవు.

'మరియ' బ్లాక్ ఇంక్‌లో మొదటి కథ, గుండెల్ని ద్రవింపచేసే కథ. అగ్రకులాహంకారి వెంకట్రావు. అతని కొడుకు 'మల్లి' వికృత లైంగిక చేష్టలకు చెల్లెలు మార్త బలికాగా, వెంకటేశ్వరావు కామత్వానికి 'మరియ' బలై బావిలో శవమై తేలుతుంది. అయితే ఈ దారుణాన్ని వెంకట్రావు తనపై మోపుకోడు. అంతేకాక అతని అన్న 'మాది నిప్పుని కడిగే వంశం...కడజాతి పిల్లను నా తమ్ముడు తాకుతాడా...?' అనే మాటల్లో అగ్రకులహంకారం స్పష్టంగా కనిపిస్తుంది. అగ్రవర్ణాల చేతుల్లో అన్ని విషయాల్లోనూ అంటరానితనాన్ని అనుభవిస్తూ అత్యాచారాలకు కూడా బలవుతున్న అనేకమంది దళిత యువతులకు ప్రతినిధిగా మరియు కన్పిస్తుంది.

సమాజాన్ని చూసే చూపులో పిల్లలపై తల్లిదండ్రుల ప్రభావం ఎలా ఉంటుందో 'బ్లాక్ ఇంక్' కథలో చిన్నమ్మాయి శ్రియ ద్వారా తెలుస్తుంది. తనకు నచ్చిన విషయాలను బ్లూ ఇంక్‌తోనూ, నచ్చని విషయాలను బ్లాక్ ఇంక్‌తోనూ డైరీలో రాసే అలవాటున్న శ్రియ మంచి నీళ్ళ కోసం రచయిత ఇంటికొస్తుంది. ఎంతవేగంగా వారి మధ్య సాన్నిహిత్యం

ఏర్పడుతుందో, కులం తెలిశాక అంతే వేగంతో వారి మధ్య దూరం పెరుగుతుంది. తన తల్లిదండ్రుల ద్వారా కుల వివక్ష పాఠాలు నేర్చుకున్న శ్రియ, తాను పెద్దయ్యాక ఇదే వారసత్వాన్ని తరతరాలకు అమలు చేస్తుందని చెప్పే రచయిత్రి ఆవేదన ఈ కథలో కన్పిస్తుంది.

'బాలేదు జెరమొచ్చింది' కథ దళిత పేద కుటుంబంలో పుట్టిన చిన్న పిల్ల 'ఎస్తేర్' కథ. మూడు రోజుల నుండి ఇంట్లో అన్నం చేసే పరిస్థితి లేకపోతే, జ్వరం కారణం చెప్పి ఆకలి తీర్చుకోవాలని ఆశపడుతుంది ఎస్తేర్. ఆకలి వేటలో తాను చేయగలిగిందల్లా చేస్తుంది. చివరకు నిజంగానే జ్వరమొచ్చి సొమ్మసిల్లి పోయి అపస్మారక స్థితిలోకి వెళ్తుంది. ఇది ఎస్తేర్ కథ మాత్రమే కాదు దళిత పేద కుటుంబాల్లో ఇలాంటి ఎస్తేర్‌లు చాలామందే కన్పిస్తారు. ఆకలిని పూడ్చుకోలేని ఎస్తేర్ లాంటి దళిత బాల్యం ఈ సమాజంలో ఏ విధంగా ముందుకుపోవాలి? తమ జీవితాన్ని ఎలా సుఖవంతం చేసుకోవాలి? అనే రెండు ప్రశ్నల్ని రచయిత్రి ఈ కథ ద్వారా పాఠకుని ముందుంచింది.

***ఆకలిని పూడ్చుకోలేని ఎస్తేర్ లాంటి దళిత బాల్యం ఈ సమాజంలో ఏ విధంగా ముందుకు పోవాలి? తమ జీవితాన్ని ఎలా సుఖవంతం చేసుకోవాలి? అనే రెండు ప్రశ్నల్ని రచయిత్రి ఈ కథ ద్వారా పాఠకుని ముందుంచింది.***

ఈ కథల్లో మరో విషాద కథ 'బ్లాక్'. నేటి ఆధునిక కాలంలో కూడా జిలుకరమ్మ వంటి వారితో సఫాయి పని చేయించుకొని ఆమెకు తగిన వేతనాన్ని కూడా ఇవ్వని అగ్రవర్ణాల అమానుషత్వాన్ని ఈ కథ తెలుపుతుంది. తన కూతురు పెళ్ళి కోసం డబ్బు సంపాదించాలనే చిన్ని తపనతో లెట్రిన్‌లను బ్లాక్ చేసిన జిలుకరమ్మపై దాడికి దిగిన అగ్రవర్ణ పురుషులు, వనితల చర్య హేయమైనది. బూతులు తిట్టడమే కాకుండా ఆమె ఒంటిపైనున్న బట్టలన్నీ లాగేసి వివస్త్రను చేసి కొడతారు. ఆమె 'తంతే తన్నారు, డబ్బులుంచాల్సింది' అని అనుకుంటుంది. ఆ మాటలకి పాఠకుడి కళ్ళల్లో కన్నీళ్ళు రాక మానవు. ఇలాంటి దుర్భరమైన జీవితాన్ని నేటికీ దళిత స్త్రీలు అనుభవిస్తున్నారని చెప్పడమే రచయిత్రి ప్రధాన ఉద్దేశం.

'ప్రియుడు కావాలి' కథ అందం, తెలివి ఉన్న పిహెచ్.డి స్కాలర్ అయిన దళిత అమ్మాయి కథ. అగ్రకుల ప్రేమికుడు పెళ్ళి వద్దని జీవితాంతం ప్రియురాలిగా ఉండమంటే, మరొకడు ఆదర్శం కోసం తనని వివాహం చేసుకుంటానంటాడు. మరొక యువకుడు ఒకే కులం కాబట్టి పెళ్ళి చేసుకుందామని చెప్తాడు. ఈ మూడింటిని ఆమె తిరస్కరిస్తుంది. ఆమెకు కావాల్సింది, తన అస్తిత్వాన్ని గుర్తించి ఏ చట్రానికి తనను బంధీచెయ్యని 'ప్రియుడు కావాలి'.

బైబిల్‌లోని 'తప్పిపోయిన కుమారుని' కథని గుర్తు చేసిన కథ 'తప్పిపోయిన కుమార్తె'. ఈ శీర్షికే ఈ కథకు కొండంత బలం. దళిత కుటుంబంలో పుట్టిన 'సువార్తరాణి' తన బ్రాహ్మణ స్నేహితురాలు గాయత్రి స్నేహంతో మెల్లగా బ్రాహ్మణత్వంలోకి తన స్వభావాన్ని, వేషాన్ని మార్చుకుంటూవస్తుంది. తన దళిత వాసనలను ఎక్కడ బయటకు కన్పించకుండా కప్పిపుచ్చుతుంది. వారం రోజులు గాయత్రి వాళ్ళ ఇంట్లో ఉన్న తర్వాత బ్రాహ్మణ ముసుగులోని కాపట్యాన్ని, దళితుల పట్ల వారి వివక్షను గమనించిన సువార్తరాణికి తన సొంత గూటి విలువ తెలిసొస్తుంది. ఎన్ని అనుకరణలు సాగించినా దళితులపై అగ్రవర్ణాల చూపు మాత్రం ఒకే విధంగా ఉంటుందని ఈ కథలో స్పష్టమవుతుంది.

అప్పుల బాధతో ఆత్మహత్య చేసుకొన్న ఓ మోతుబరి రైతు రఘురాం రెడ్డి. ఆయన ఆత్మహత్యే 'ఓ విలన్ ఆత్మకత్య'. చాలా కాలంగా అనేక రకాలుగా దేవమణిని వాడుకున్న రఘురాం రెడ్డి ఆమెకు నిజంగా విలనే. అతను చనిపోవడం ఆమెకు నిజంగా ఆనందమే. అతడు చనిపోయిన వార్త విన్నాక ఇంటికొచ్చి శుభ్రంగా స్నానం చేసి, దున్నకూరతో అన్నం తిని తనవితీర నిద్రపోతుంది. అంతలోనే తన కూతురు యేసుదాసమ్మ కూడా రఘురాం రెడ్డి లాంటి మరొకరి లైంగిక దాడికి గురికావడం చూసి విస్మయం చెందుతుంది. దళిత స్త్రీలను మానసికంగానూ, శారీరకంగానూ హింసించి తన కోర్కెలను తీర్చుకొనే రఘురాం రెడ్డి చనిపోయినప్పటికీ అలాంటి వాళ్ళు సమాజంలో చాలా మంది పుట్టుకొస్తూనే ఉంటారు. వారి నుండి జాగ్రత్త పడాల్సిన అవసరాన్ని రచయిత ఈ కథలో చెప్పకనే చెప్పారు.

అగ్రవర్ణ అన్యాయానికి గురైన మరో యువతి కథ. 'కుమారక్క కథ'. నిజాయితీగా ప్రేమించి పెళ్ళి చేసుకొని తనకు తెలియకుండానే తాను మోసపోయి, నిజం తెలుసుకోకుండానే ఈ లోకం నుంచి నిష్క్రమిస్తుంది. అగ్రవర్ణ పురుషులు దళిత యువతులను ఏ విధంగా ట్రాప్ చేసి వాళ్ళకు ఆత్మహత్యల్లాంటి హత్యలను బహుమానంగా ఇస్తున్నారో ఈ కథ చవిదితే తెలిసిపోతుంది.

# కన్నీటి చుక్క

- బొద్దూరు విజయేశ్వరరావు
8985079163



రోజులాగే ఆ రోజూ ఆమె ప్రత్యక్షమైంది!
ఏ కాఱు మేఘం కబంధ హస్తాలలో
ఒదిగిపోయిన ప్రతిఫలమో
ఆమె ఒడిలో గుక్కపెట్టి వెక్కిరిస్తోంది!
కన్నులు విచ్చుకోని
కల్మష ప్రపంచాన్ని తాకని
కన్నపేగు సాక్షిగా
చితికిపోయిన బతుకు చిత్రాన్ని
పెట్టె పెట్టెకు చూపిస్తూ
ఆకలి మంటలను చల్లార్చుకుంటోంది!
రైలుబండే ఆమె బతుకు బండి!
మర్రి ఊడల్లాంటి జుత్తుతో,
రెప్పల మాటున సూర్యుడ్ని దాచినట్లు
నిద్రకు సెలవిచ్చిన కళ్ళతో,
ఇనుప చువ్వలే ఒడ్డాణమైన నడుముతో
డోలును హారంగా వేసుకొన్న మెడతో,
పాషాణ నగ్న పాదాలతో,
కన్నీటి చుక్కలు పొదిగిన
కష్టాల కిరీటాన్ని తలపై ధరించిన
దరిద్ర సుందరి ఆమె!
చిల్లులు పడ్డ ఆమె చీర వెనుకనున్న
మాంసపు ముద్దల కోసం
వేటాడే మృగాళ్ల వెంటాడుతున్నా
యాచనే ఆమె ఆలోచన!
అర్థించే ఆమె ఆవేదనలో
అభాగ్యుల ఆర్తనాదం వేదంలా
ఘోషిస్తుంది!
గమ్యంలేని తన ప్రయాణంలో
గుండె కొలిమిలా మండిపోతున్నా,
నరలోకం నరకలోకంగా కన్పిస్తున్నా,
పిడికెడు మానవత్వం కోసం పరితపిస్తూ,
పొట్ట కూటికై జీవన పోరాటం చేస్తుంది!
చిల్లర పైసల వేటలో అలసిపోయి
నిదురపోతున్న ఆమె జీవితం
నిర్భయ సుప్రభాతం కోసం నిరీక్షిస్తుంది!

---

వాస్తవాన్ని నిర్భయంగా అక్షరరూపం ఇచ్చిన కథ 'కట్ట' డెబ్బైయేండ్ల స్వాతంత్ర్య దేశంలో స్త్రీలకు మరుగుదొడ్లు లేని పరిస్థితిని, దళిత స్త్రీల దౌర్భాగ్య పరిస్థితిని ఈ కథ కళ్ళముందుచుంతుంది. కాలేజి నుండి సెలవులకై ఇంటికొచ్చిన ఓ దళిత అమ్మాయి విరేచనాల కారణంగా ప్రతిసారీ చెంబుతో 'కట్ట'కు పోవడాన్ని చెప్తూ ఒక దుర్మార్గమైన సమాజంలో దళిత స్త్రీల జీవితాన్ని వాస్తవ కోణంలో చిత్రించారు. ఇలాంటి జీవిత వాస్తవికత్వాన్ని నేటి ఏ రచయితా, ఏ రచయిత్రి అంతగా చిత్రించలేదేమో అని చెప్పడం అతిశయోక్తికాదు. ముసలామె కరుణమ్మ కట్ట మీద కెళ్ళి రైలు కింద పడి చనిపోవడంతో ముగిసే ఈ కథ గుండెల్ని పిండిచేస్తుంది.

అట్టడుగు కుల్లాల్లో కూడా ఒక కులం నుండి మరొక కులానికి వివాహాలు జరగలేని పరిస్థితిని మన దేశంలో కులాన్ని, కులవ్యవస్థ పటిష్టత్వాన్ని ఎండగడుతూ చెప్పిన కథ 'చాకలికూడు' తన మేనకోడళ్ళకు ఆత్మగౌరవ అస్తిత్వ సిద్ధాంతాలను చెప్పిన అత్త కథ 'అత్త అంబేద్కర్‌లా వుంది' కథ.

బ్లాక్ ఇంక్‌లోని అన్ని కథల్లో దళిత స్త్రీ వివిధ కోణాలు స్పష్టంగా కనిపిస్తాయి. 'బ్లాక్ ఇంక్' కథా సంపుటి దళిత స్త్రీవాదాన్ని తెరపైకి తెచ్చిన ఓ మంచి పుస్తకంలా చెప్పుకోవచ్చు.

దళిత స్త్రీని అగ్రవర్ణాలు ఎంత నీచంగా, ఎంత హీనంగా చూస్తారో ఈ కథల ద్వారా మరింతగా తెలుస్తున్నది. అన్ని సమయాల్లో అంటరానితనాన్ని పాటించిన అగ్రకులాలు దళిత యువతుల్ని బలవంతంగా తాకి, అత్యాచారం చేసే విషయంలో వారి అంటు ఏమవుతున్నదో ఎవ్వరికీ అర్థం కాని ప్రశ్న. అగ్ర వర్ణాలు దళితుల పట్ల ఎలాంటి తీరు కలిగివుంటారో, కుల వివక్షను దళితుల పట్ల ఏ విధంగా చూపిస్తారో మొదలైన విషయాలన్నింటినీ వినోదిని గారు ఈ కథల్లో సూక్ష్మంగా వివరించారు. దళిత వాస్తవ జీవితం తెలియని రచయితలకు, విమర్శకులకు ఈ కథలు వెగటు పుట్టించొచ్చు. వాస్తవం ఎప్పుడు పచ్చిగాయంలాగానే ఉంటుంది. వాస్తవం ఎప్పుడూ వాస్తవం లాగానే ఉంటుంది. దళిత కలం ఎంత పదునైందో చెప్పడానికి ఈ కథలు శాంపిల్స్ మాత్రమే. దళిత స్త్రీ వాస్తవ జీవిత కోణాలను లిఖించిన 'బ్లాక్ ఇంక్' నిజంగానే బరువైనది, బలమైనది కూడా.

# ఏది దారి?

- ఫెర్నాండో పెన్నీఓ
తెలుగు: సత్యరంజన్

పెట్టుబడి, దోపిడి, పోరాటం - ఈ మూడు పదాలూ వింటే చాలు తమ భద్రలోక జీవుల నుండి ఇటు సామాన్యుల వరకూ ఉలికిపాటుకు గురవుతున్న సంధికాలం ఇది. ఈ పదాలకు దూరం దూరం దూరంగా జరిగే క్రమంలో రోజువారీ దోపిడి వ్యవస్థమైకపు కౌగిట్లోకి చేరి సేదతీరుతున్న విచిత్ర సందర్భం ఇది. ఇలాంటి సంక్లిష్ట సామాజిక సందర్భంలో ప్రజలను చైతన్యవంతం చేసి, కర్తవ్య నిర్వహణకు సంసిద్ధం చెయ్యడంలో కవులు, రచయితలు,కళాకారులు పోషించాల్సిన సముచిత పాత్ర మరింత సంక్లిష్టంగా తయారయింది. ఈ వివేచన కొరవడిన సాహిత్యకారులు, కళావిప్లవ వాగాడంబర పదజాలాన్ని విరివిగా వాడడం ద్వారా ఈ ఆలోచనా స్రవంతి పరిధిలో లేని ప్రజా సమూహాలను ప్రభావితం చెయ్యడంలో విఫలం కావడం మాట అటుంచి వారిని మరింత దూరం చేసుకుంటున్నారేమో ఆలోచించాలి. ప్రజలు వాళ్ళ రోజువారీ జీవితానుభవంలోంచే నేర్చుకునేంత నగ్నంగా, భయోద్విగ్నంగా దోపిడి జరుగుతున్న కాలం ఇది. అమూర్త భావనలు, అస్పష్టతలు, సంక్లిష్టతలను విడనాడి ప్రజల జీవిత పార్శ్వాల్లోంచే సాహిత్య సృజన మరీ ముఖ్యంగా కవితాసృజన జరగాలి. మెక్సికోలోని 'చియాపాస్' మూలవాసుల ప్రతిఘటనా పోరాటం అటువంటి విశేష అనుభవాలను అందిస్తుంది. కొన్ని కవితల అనువాదాలు అందిస్తున్నాము.

*1.*
నా గుండెలో
ఒక ఆకాంక్షల ముల్లు
ఒక రోజున దాన్ని పెరికివేసా
నా గుండె స్పర్శ నాకు తెలీడంలేదు.
సూదంటు బంగారపు ముల్లు
ఎవరు అనుభూతిస్తారు దీన్ని
మళ్ళీ గుండెకే గుచ్చు

*2.*
రాత్రి నాకు ఒక కల వచ్చింది
దేవుడు నన్ను గద్దించాడు 'అలా బయటకి చూడమని'
తర్వాత దేవుడు నిద్రకు పడ్డాడు
నేను గొంతెత్తి అరిచా 'మేలుకో' అని

**అనంతస్రావం**

నా ఛాతిలో ఒక గాయం
గోధుమలు ప్రవిస్తుంది
కాని ఒక్క రొట్టెముక్కాలేదు
ఆకలి...ఆకలి వేస్తోంది

**ఒక జాతి విషాదం**

వాళ్ళు నన్ను చితకబాదారు
నొప్పి
కుంట భూమిలా
భయోద్విగ్నం
ఎన్నటికీ మాయని గాయాలు
కొడతం, పడడం
వాళ్ళు నన్ను చితకబాదారు
ఇదొక అంతులేని శాపం
ఇల్లు శిధిలమైపోతుంది
చేదు మింగినట్లుంది-
ఓహ్! ఈ చరిత్ర ఎంత భారంగా ఉందీ
సమస్తం నయవంచన - దోపిడి
అవమానాలు - రోజుకొకటిగా
తాజాగా చేరుస్తున్నారు
లోభిత్వం పోగుపడిపోతుంది
సామ్రాజ్యవాదపు డేగ నా అంతరాలను చీల్చేసింది
శక్తివంతమైన ప్రజలు/ విడిపోయి ఉన్నారు వాళ్ళలో వాళ్ళు
నా సముద్రాలు, పర్వతాలు
నా నదులు, ఎడారులు
నా లోయలు, జలపాతాలు
ఇవే నా గాయాలు
అగాధమైనవి, అంతులేనివి
నా భూమిని పిండేస్తున్న బాధ
నా బీద భూమి బాధ
నా కొడుకు నయవంచనకు గురైన బాధ

నా యుద్ధం కోల్పోయిన బాధ

**పదం**

బురదలో పునీతమవనీ
వర్షంలో చిగురించనీ
ఎండలో పొడారిపోనీ
ఒకదానితో ఒకటి మాట్లాడుకోనీ
పైకి తీసుకురావడానికి
రూపాన్నీ, సారాన్నీ ఇవ్వనీ

ఈ రోజుల్లో ఏం జరిగిందో
రేపు ఎప్పుడో విస్తారంగా రాసే రోజువస్తుంది.
అయితే ఇవాళ కనీసంగా, ఖచ్చితంగా
మనం ఒక మాట చెప్పొచ్చు
ఐదు ఖండాలు కన్న కల
ఇక్కడ 'లా రియాలిడాడ్' లోనాకారమవుతుంది

**నయా ఉదారవాదం**

ఒక ప్రపంచయుద్ధం
అతి కిరాతకమైనది
సర్వ సంపూర్ణమైనది
విశ్వవ్యాపితమైనది
అత్యంత ప్రభావవంతమైనది

ప్రతిదేశం
ప్రతి నగరం
ప్రతి పల్లె
ప్రతి ఇల్లు
ప్రతి మనిషీ
ఇప్పుడు - చిన్నదోపెద్దదో
ఒక యుద్ధరంగమే

ఒకవైపు నయాఉదారవాదం
అణచివేసే శక్తితో, మృత్యుహేలతో
రెండోవైపున
సగటు మానవుడు

**చాలించు**

ఈ అబద్ధాలు చాలింక
ఈ నేరాలూ ఘోరాలూ చాలింక
ఈ చావులు చాలింక
ఈ యుద్ధం చాలింక
ఆడా - మగా ఎవరైనా
ఇంతకన్నా ఏం చెప్తారు?

**ప్రజాస్వామ్యం - స్వేచ్ఛ- సమన్యాయం**

మేం స్వేచ్ఛగా ఉండదలిచాం
అందుకు ఉన్న ఒకే మార్గం మేం ఐక్యంగా ఉండడం
స్వేచ్ఛ, సంఘీభావం
మేం ఈ రెండూ కోరుకునేది అందుకే
మేం ఈ ప్రపంచంలోకి అడుగుపెట్టం
డబ్బు, అధికారం ఉన్నవాళ్ళు మమ్మల్ని వేటాడుతుంటారు
ఎందుకంటే మేం ఉన్నదే వాళ్ళని సతాయించడానికి.
అయినా మేం వెళ్ళిపోం
మౌనంగానూ ఉండం
నిటారుగా నిలబడతాం
పోరాడుతాం
మేం మరో ప్రపంచాన్ని నిర్మిస్తాం
మెరుగైన ప్రపంచాన్ని
అన్ని ప్రపంచాలూ అందులో ఒక్కటిగా ఒదిగిపోయేంత
పెద్దదాన్ని
మెరుగైన దాన్ని

**సంబంధిత వారందరికీ**

నేనొక కాందిశీకుణ్ణి
పుట్టగానే
వాళ్ళు నన్ను
నాలోనే ఖైదు చేశారు.
కానీ నే తప్పించుకున్నా
నా ఆత్మ నాకోసం వెతుకుతుంది.
అడవుల వెంటా, లోయలవెంటా
నా ఆత్మ నన్ను
ఎప్పటికీ దొరకపుచ్చుకోలేదని
ఆశిస్తున్నా



# స్వీకారం

## పరస్పరం




**శ్రీ భమిడిపాటి జగన్నాథరావు**

**వ్యాసాలు, ఆయన గురించి పలువురి**

**రచనలు మరియు సమీక్షలు**

వెల : 150/- పేజీలు: 198

ప్రతులకు : 09848132208

శ్రీ భమిడిపాటి జగన్నాథరావు గారు, మిత్రుల దగ్గర మాట్లాడిన విలువైన విషయాలతో పోల్చిచూస్తే ఆయన గ్రంథస్తం చేసిన విషయాలు తక్కువ. అలా ఆయన చెప్పిన చాలా విషయాలు రికార్డు కాలేదు. రాసినవైనా ఒక చోట వుంటే బావుంటుందని, అది అవసరమని భావించాం. అతికష్టం మీద ఆయన దానికి అంగీకరించారు. మొదటి భాగం శ్రీ భమిడిపాటి జగన్నాథరావుగారు వ్రాసినవి, రెండవభాగం శ్రీ భమిడిపాటి జగన్నాథరావు గారిపై ఇతరులు రాసినవి, మూడవ భాగం శ్రీ భమిడిపాటి జగన్నాథరావు కథలపై సమీక్షలు.

– మిత్రబృందం

## ది హార్వెస్ట్




**డా॥ పి. రమేష్ నారాయణ**

వెల : 90/- పేజీలు: 121

ప్రతులకు : 9440222117

దేశానికి వెన్నుగర్ర అయిన రైతు సేద్యం అనుభవాలు, రాయలసీమ రైతు వ్యవసాయజీవనం ఆధునికకవిత్వంలో అత్యంత సమాజంగా అక్షరబద్ధం గావించబడిన ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డిగారి ప్రసిద్ధ కావ్యం "పొలి". ఇందులోని అంశాలు జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ పాఠకులు అవగాహన పొందడానికి "ది హార్వెస్ట్" అన్న పేరుతో ఈ కావ్యాన్ని ఆంగ్లంలో వెలుగులోనికి తేవడానికి గావించిన ఒక చిన్న ప్రయత్నం ఇది.

– డా॥ పి. రమేష్ నారాయణ

## తప్తస్పృహ




**మౌనశ్రీ మల్లిక్**

వెల : 100/- పేజీలు: 152

ప్రతులకు : 9394881004

తప్తస్పృహ – ఇంతగా కాలిన ఈ స్పృహ చైతన్యంకాగలిగితే. అయిన సందర్భాలు లేవని కాదు. ఇంత తప్తస్పృహ నుంచి ఇటువంటి ఒక ప్రాపంచిక దృక్పథంతో స్థిరంగా, దృఢంగా ఏర్పడితే ఎంత బాగుండుననిపిస్తుంది.

– వరవరరావు

## చార్వాక దర్శనం




**డా॥ కత్తి పద్మారావు**

వెల : 200/- పేజీలు: 231

ప్రతులకు : 9849741695

ఆరు సంవత్సరాలు నిరంతరం అధ్యయనం తరువాత ఈ రచన పూర్తయింది. చుండూరు సంఘటన జరిగే నాటికి పుస్తకం ముద్రణ కూడా పూర్తయింది. ఈ కాలంలో దళిత ఉద్యమంలో, పోరాటం చార్వాక దర్శన రచన యేకమై సాగింది. భారతదేశంలోని దళిత బలహీన మైనారిటీ వర్గాల విముక్తి పోరాటానికి ఈ గ్రంథం సిద్ధాంత ఆయుధం అవుతుందని విశ్వాసం ఉంది.

– డా॥ కత్తి పద్మారావు

## లొంగిన ప్రతిసారి




**- పచ్చల కిరణ్ కుమార్**

వెల : 50/- పేజీలు: 94

రాత్రంతా మేల్కొని తెలవారడం చూసిన ఈ కవి వేకువలోని రంగుల శబలతనీ, పక్షుల కల స్వనాన్నీ, ప్రకృతి సౌందర్యాన్నీ తన కవిత్వానికి మరింత సాంద్రంగా అద్దాల్సే ఉన్నది. ఈ భరోసా ఈ కవిత్వంలో ఉన్నది.

– వరవరరావు

## కాకిముద్ద




**ఈతకోట సుబ్బారావు**

వెల : 100/- పేజీలు: 142

ప్రతులకు : 9440529785

ఈ కవితా సంపుటిలో రూపనిర్మాణంలో ఒక కొత్త పద్ధతి కన్పడుతుంది. భాషకూడా చాలా తేలిక అయ్యింది. ఎక్కడా మార్మికతలేదు. ఒక సూటిదనం మామూలు మాటల ద్వారా దృశ్యనిర్మాణం. మామూలు మాటలకి కొత్త ప్రాణశక్తి పోసినట్టు అంతా సజీవమై గొప్ప చలనంతో కదలాడుతుంది.

– కె. శివారెడ్డి

# కథా రచనలో కమనీయ నేస్తం






2013 లో సాహితీ స్రవంతి హైదరాబాదులో కథా రచనపై ఒక కార్యశాల నిర్వహించింది. చాలామంది ప్రముఖ రచయితలు విమర్శకులు హజరై ప్రసంగించారు. సభికులు వెలిబుచ్చిన కొన్ని సందేహాలకు కూడా సమాధానమిచ్చారు. ఈ ప్రసంగ వ్యాసాలతో తర్వాత సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక 'కథనశాల' పేరుతో వెలువడింది. అది చదివి చాలా మంది కొత్త కథకులు ప్రేరణ పొందారు. కథా కార్యశాల ప్రయోజనం అర్థం కావడంతో తర్వాత కవిత్వ తరగతులు కూడా జరిపాము.

ఇదంతా గతం. ఆ కార్యశాల ప్రభావం ఇప్పుడు మరో రూపంలోనూ మన ముందుకు రావడం సంతోషదాయకం. అక్కడ మాట్లాడి తర్వాత వ్యాసం రాసిన మహమ్మద్ ఖదీర్‌బాబు ఈ మూడేళ్లుగా నిశ్శబ్దంగా ఒంటరిగా కృషి చేస్తూ కథలు ఇలాకూడా రాస్తారు అనే 325 పేజీల అందమైన పుస్తకాన్ని తీసుకొచ్చారు. మార్చి 20న హైదరాబాదు సోమాజిగూడ ప్రెస్‌క్లబ్‌లో సాహిత్య మిత్రుల సమక్షంలో సీనియర్ రచయిత రామచంద్ర ఈ పుస్తకాన్ని ఆవిష్కరించారు. సాహిత్య ప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి సభకు అధ్యక్షత వహించి మాట్లాడుతూ పుస్తకం చాలా సమగ్రంగా అనేక కోణాలను పరిచయం చేసేలా వుందని అభినందించారు. కథా కార్యశాల ఇంత మంచి పుస్తకానికి ప్రేరణ కావడం పట్ల సంతోషం వెలిబుచ్చుతూ దీన్ని అందరికీ చేరువ చేసేందుకు ప్రయత్నిస్తామన్నారు. గతంలో కథల గురించి వచ్చిన పుస్తకాల వరవడికి భిన్నంగా ఖదీర్ బాబు వందలాది ప్రత్యక్ష ఉదాహరణలతో అప్పుడు ప్రస్తావనకు రాని ఆధునిక రచయితలతో అర్థవంతంగా దీన్ని వెలువరించారని వివరించారు. ఈ సభలో ఇంకా రచయితలు జిఆర్ మహర్షి, చూపు కాత్యాయని, కొర్రపాటి ఆదిత్య, వేంపల్లి షరీఫ్‌లు కూడా మాట్లాడారు. సభలో పాల్గొన్న కొందరు మిత్రులకు పుస్తక రూపకల్పనలో భాగం పంచుకున్న సాంకేతిక నిపుణులకు అధ్యక్షుడు పుస్తకం ప్రతులు అందించారు.



## 'గమనమే గమ్యం' ఆవిష్కరణ



ఓల్గా రచనలు సమాజాన్ని చైతన్య పరిచే విధంగా ఉంటాయని డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ కుమార్తె లక్ష్మీటాన్యా అన్నారు. మార్చి 18న విజయవాడలో మొగల్రాజపురంలోని ది విజయవాడ కల్చరల్ సెంటర్‌లో ఓల్గా నవల "గమనమే గమ్యం" పుస్తకాన్ని లక్ష్మీ టాన్యా ఆవిష్కరించారు. అనంతరం ఆమె మాట్లాడుతూ స్త్రీలలో ఆలోచనలు రేకెత్తించే విధంగా, సమసమాజ స్థాపనే ధ్యేయంగా ఓల్గా రచనా శైలి ఆద్యంతం చదివించే విధంగా ఉంటుందన్నారు. ప్రముఖ రచయిత్రులు వి. ప్రతిమ, పాటిబండ్ల రజని, ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి. రమాదేవి మాట్లాడారు. 1910 నుండి 1964 వరకూ సుమారు 50 సంవత్సరాల పాటు ఆంధ్రదేశంలో నడిచిన అనేక ఉద్యమాలకు ఈ నవల ప్రతిబింబించిందని చినుకు సంపాదకులు నండూరి రాజగోపాల్ అన్నారు. ఆయా ఉద్యమాల్లో స్త్రీలు సైతం ముందున్నారన్నారు. రాజకీయాలలో స్త్రీలకు ఎదురయ్యే ఆటంకాలను ఈ నవల మన ముందుంచుతుందన్నారు. ఓల్గా మాట్లాడుతూ సమాజాన్ని దగ్గరగా చూసినప్పుడే రచనలో సహజత్వం ఉంటుందన్నారు. స్త్రీలు అన్ని రంగాలలో రాణిస్తున్నప్పటికీ ఇంకా వారిపైన దాడులు కొనసాగటం దురదృష్టకరమన్నారు.

## 'సత్యవతి కథలు' ఆవిష్కరణ



మనసుల్లో నిద్రాణమైన మానవత్వాన్ని తట్టిలేపే చైతన్యదీపికలు 'సత్యవతి కథలు' అని ఓల్గా అన్నారు. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురించిన 'సత్యవతి కథలు' పుస్తకావిష్కరణ సభ విజయవాడలో మొగల్రాజపురంలోని శిఖర సాంస్కృతిక వేదికపై జరిగింది. కథా విమర్శకులు వాసిరెడ్డి నవీన్ పుస్తకావిష్కరణ చేసి మాట్లాడుతూ సమాజంలోని ఎన్నో సున్నితమైన అంశాలను సత్యవతి తన కథల్లో ప్రస్తావించారన్నారు. సభకు అధ్యక్షత వహించిన ఓల్గా మాట్లాడుతూ పౌరసత్వ భావాల్ని సత్యవతి తన కథల ద్వారా పాఠకుల్లో పెంపొందింపజేశారన్నారు. సాహితీవేత్త మృణాళిని మాట్లాడుతూ సత్యవతి కథలు వర్తమాన సమాజానికి ప్రతిబింబాలన్నారు. కె. శివారెడ్డి, వి.ప్రతిమ, డాక్టర్ వి. చంద్రశేఖరరావు, నండూరి రాజగోపాల్, వల్లూరి శివప్రసాద్, పి. హరనాథరెడ్డి తదితరులు సత్యవతి రచనల్లోని వైశిష్ట్యాన్ని, సమాజాన్ని ఉత్తమంగా తీర్చిదిద్దాలనే లక్ష్యంతో రచయిత్రి చేసిన ప్రయత్నాన్ని అభినందిస్తూ ప్రసంగించారు. సాహితీ మిత్రులు పక్షాన శ్రీశ్రీ ప్రింటర్స్ అధినేత విశ్వేశ్వరరావు కార్యక్రమాన్ని సమన్వయపరిచారు.

## ఈతకోట సుబ్బారావు కు ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు



ఉమ్మడి శెట్టి సాహితీ అవార్డు -2015 కోసం ఈతకోట సుబ్బారావు 'కాకిముద్ద' కవితా సంపుటి ఎంపికైనట్లు అవార్డు వ్యవస్థాపకులు డా॥ఉమ్మడి శెట్టి రాధేయ ఒక ప్రకటనలో తెలియజేశారు. ఈ అవార్డు న్యాయనిర్ణేతలుగా డా॥ అమ్మంగి వేణుగోపాల్, శ్రీ ఖాదర్ మొహిద్దీన్, శ్రీ వాడ్రేవు చినవీరభద్రుడు వ్యవహరించారని తెలిపారు. అవార్డు పొందిన ఈతకోట సుబ్బారావు నెల్లూరుకు చెందిన జర్నలిస్టుగా, సీనియర్ కవిగా, నెల్లూరు జిల్లా చరిత్ర విశ్లేషకునిగా సాహిత్యరంగానికి సుపరిచితులేనని తెలిపారు. ఈ అవార్డు ప్రదానం మే నెలలో అనంతపురంలో జరుగుతుందని డా॥ రాధేయ ఆ ప్రకటనలో తెలియజేశారు.

## 'చౌరబాటు' ఆవిష్కరణ

తెలంగాణ సాహితి ఆధ్వర్యంలో ఖమ్మంలో మార్చి 13న శిరంశెట్టి కాంతారావు చౌరబాటు కథాసంకలనాన్ని పెద్దింటి అశోక్ కుమార్ ఆవిష్కరించారు. అనంతరం మాట్లాడుతూ శిరంశెట్టి కాంతారావు కొత్త దృక్కోణంలో తాజా పరిస్థితుల అన్వయంతో ప్రపంచీకరణ నేపథ్యాన్ని ఆసరాగా తీసుకొని చక్కని మానవ సంబంధాల సమాహారాన్ని అందించారని కొనియాడారు. కళ్ళు మూసుకునైనా కవిత రాయొచ్చు. అవగాహన చేసుకున్న పిదపే కథ రాయ వీలవుతుందని ముఖ్య అతిథిగా పాల్గొన్న విమర్శకులు, ఆచార్య మేడిపల్లి రవికుమార్ అన్నారు. తెలంగాణ సాహితి రాష్ట్ర కన్వీనర్ ఆనందాచారి మాట్లాడుతూ కథల్లో సామాజిక దృక్పథం, బడుగు బలహీన



వర్గాల బాగు, చెప్పుకోవడానికి ఎవరూలేని వాళ్ళు యెదుర్కొంటున్న సమస్యల ప్రతిబింబంగా కథలుండాలని అన్నారు. కాంతారావు గతంలో మట్టి తాళ్ళవల, ఆకుపచ్చ విధ్వంసం లాంటి రచనలందించారన్నారు. కథా రచయితగా పేరు సంపాదించుకున్నందుకు ఖమ్మం జిల్లా వాసిగా వారికి తెలంగాణ సాహితీ తరపున ఆత్మీయ అభినందనలన్నారు. కొత్తగూడెం బాలోత్సవ్ నిర్వాహకులు, వాసిరెడ్డి రమేష్ బాబు మాట్లాడుతూ సమాజంలో పిల్లలే మైలు రాళ్ళని వారి యెదుగుదలకు, చైతన్యానికి కథలు రావలసివుందని, ఆ లోటు కథా రచయితలు తీర్చాలని కోరారు. ప్రముఖ విమర్శకుడు, మండవ సుబ్బారావు కాంతారావు గారితో వున్న సాహిత్య సాన్నిహిత్యాన్ని నెమరువేస్తూ ఇంకా మరిన్ని రచనలు చేయాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నానన్నారు. వరంగల్ కాకతీయ యూనివర్సిటీలో కాంతారావు కథలపై పరిశోధన చేస్తున్న నాగయ్య సభకు పరిచయం చేసుకున్నారు. 2003లో ప్రజాశక్తి ఆదివారం అనుబంధంలో తన మొదటి కథ ప్రచురితమైందని, అలా ప్రారంభించిన కథా రచన ఇలా మిత్రుల ప్రోత్సహం, విమర్శకుల సలహాలతో కొనసాగుతూవుందని. బడుగు బలహీన వర్గాల పక్షానే తన కథనం నడుస్తుందని శిరంశెట్టి కాంతారావు తన స్పందనలో తెలిపారు. ఈ కార్యక్రమంలో బి.సి కార్పోరేషన్ అధికారి ఆంజనేయ శర్మ, కపిల రాంకుమార్, రౌతురవి, కన్నెగంటి వెంకటయ్య, కె. దేవేంద్ర, తదితరులు పాల్గొన్నారు. కవి, రచయిత సునంద వందన సమర్పణ చేశారు.






**2016 ఫిబ్రవరి 27న** భద్రాచలంలో ప్రముఖ కవి యన్.సి హెచ్ చక్రవర్తి రచన **"నానీ పంచశతీ"** ఆవిష్కరిస్తున్న ఆచార్య యన్. గోపి. చిత్రంలో డా॥ యస్. రఘు, మాగంటి సూర్యం తదితరులు



ఫిబ్రవరి 7న హైదరాబాద్ రవీంద్రభారతీలో ప్రదర్శించిన "నాయకురాలు' నాటకానికి మూల కథనందించిన హై. హెచ్.కె. మోహన్‌రావును సత్కరిస్తున్న తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సలహాదారుడు కె.వి. రమణ ఐ.ఏ.స్(రి), ప్రఖ్యాత కవి నందిని సిధారెడ్డి, పద్మశ్రీ, గజం గోవర్ధన్, పూర్వ వీ.సి అనుమాండ్ల భూమయ్య.



హైదరాబాద్‌లో పొట్టి శ్రీరాముల తెలుగు విశ్వవిద్యాలయాలో ఫిబ్రవరి **26**న జరిగే కార్యక్రమంలో శ్రీమతి కొలకలూరి విశ్రాంతమ్మ సాహిత్య పరిశోధక పురస్కారాన్ని అందుకుంటున్న శ్రీమతి కనపర్తి విజయలక్ష్మీ. చిత్రంలో కొలకలూరి ఇనాక్, కొలకలూరి మధుజ్యోతి తదితరులు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor, T. Ravi**

# కందుకూరి వీరేశలింగం

(16.04.1848 - 27.05.1919)



నవ్యాంధ్ర వైతాళికుల్లో ప్రథములు, సంస్కర్త, వితంతు వివాహాలను ఉద్యమంగా చేపట్టారు. మహిళల విద్యాభివృద్ధికి కృషిచేశారు. సాంఘిక దురాచారాలను ప్రతిఘటించారు. సాహితీరంగంలో గొప్ప కృషి జరిపారు. పలు పత్రికలు కూడా నడిపి, కొత్త రచయితలను ప్రోత్సహించారు.



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A169 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | K.Daveep |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |